## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) తిరుమల తిరుపతి దేవస్థానం వారి వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సమగ్ర ఆబ్దిక ప్రయోగము

## (యజుర్వేదము)




సంకలన కర్తలు :

ముత్య వీర వేంకట దీక్షితులు

పొన్నపల్లి వేం[illegible]

# సమగ్ర ఆబ్దిక ప్రయోగము

(యజుర్వేదము)




సంకలన కర్తలు :

**ముత్య వీర వేంకట దీక్షితులు**

**పొన్నపల్లి వేంకట [illegible]ర్య**

# సమగ్ర ఆబ్దిక ప్రయోగము

సంకలన కర్తలు :
**ముత్య వీర వేంకట దీక్షితులు, పొన్నపల్లి వేంకట కృష్ణయ్య**

ప్రథమ ముద్రణ : జూన్, 2008

ప్రతులు : 1000

**మూల్యము : రూ. 40-00**

ప్రాప్తిస్థానము :

1. **ముత్య వీర వేంకట దీక్షితులు**
   42-2-22/3, 4వ క్రాస్ రోడ్, రామకృష్ణాపురం,
   విజయవాడ - 520 003. ఫోన్ : 0866-2534205

2. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక,
   విజయవాడ-520 013. ఫోన్ : 0866-2522824

3. **ముత్య శేషశాయి**
   5వ క్రాస్ రోడ్, రామకృష్ణాపురం,
   విజయవాడ - 520 003. సెల్ : 93978 44400

4. **జటావల్లభుల జగన్నాయకులు**
   ప్లాట్ నెం. 202, ESSAR ఎంక్లేవ్, శివాజీపాలెం,
   విశాఖపట్నం - 530 017. ఫోన్ : 0891-2704954

5. **పొన్నపల్లి వేంకట కృష్ణయ్య**
   9-42-1A, బాలాజీ నగర్, విశాఖపట్నం - 530 003.
   ఫోన్ : 0891-2755314

6. **ముత్య వేంకట కృష్ణ**
   ప్లాట్ నెం. 208, రామచంద్ర టవర్స్, ఈస్ట్ ఆనంద్ బాగ్, మల్కాజ్‌గిరి,
   సికింద్రాబాద్ - 500 047. ఫోన్ : 040-27246388

ముద్రణ : నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ-3. ఫోన్ : 2574828




ఈ గ్రంథము తిరుమల తిరుపతి దేవస్థానము వారి

ఆర్థిక సహాయముతో ముద్రించబడినది.

శ్రీ గణేశాయ నమః

# ముందు మాట

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మేనిధనంశ్రేయః పరధర్మో భయావహః ॥ భగవద్గీత 3-36

మన భారతదేశం కర్మభూమి. భారతీయుల నిత్యజీవితంలో వైదిక కర్మలు పెనవేసుకుని ఉంటాయి. పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్ల కర్మాచరణ అనేక మార్పులకు లోనై దీనియందు శ్రద్ధ తగ్గుతున్నప్పటికీ ఈ తరంలో అనేకులు విధ్యుక్త ధర్మకర్మాచరణ వైపు ఆసక్తి చూపిస్తున్నారు. ఇటువంటి వారికి మార్గదర్శకంగా ఉండేందుకు, వైదిక వృత్తిలోని వారికి కూడా ఉపయుక్తంగా ఉండేందుకు, మాలో మొదటివారు "సంస్కార కాలసంగ్రహము" అనే గ్రంథాన్ని సంకలనం చేసి ప్రచురించడం జరిగింది. దానికి అనుబంధంగా మరణానంతర సంస్కారానికి సంబంధించిన విషయాల ధర్మసూక్ష్మాలకు ప్రాధాన్యమిస్తూ వివరించే "మరణానంతర విధి" అనే పుస్తకాన్ని మేమిరువురము సంకలనం చేసి ప్రచురించాము. ఈ రెండవ పుస్తకం రచించే సమయంలో ఆబ్దికాది శ్రాద్ధాలకు సంబంధించి మంత్రంతోపాటు క్రియను విపులంగా వివరించే ఒక పుస్తకం ఆవశ్యకతను గుర్తించాము.

ఆ దిశలో అనేక గ్రంథాల నుంచి విషయం సేకరించి, కొందరు వేదపండితులను సంప్రదించి ఈ పుస్తకాన్ని సంకలనం చేశాము. ఇందులో సస్వరంగా విచ్ఛిన్నోపాసన సహిత యజుర్వేద ఆబ్దిక (శ్రాద్ధ) మంత్రము, మంత్రంలో ప్రతిసందర్భంలో విపులమైన క్రియావివరణము ఇవ్వటానికి ప్రయత్నం చేశాము. ప్రథమ ప్రయత్నం కాబట్టి లోపాలు, దోషాలు దొర్లవచ్చు. విజ్ఞులైన పాఠకులు మాకు తెలియజేస్తే కృతజ్ఞతతో మలిప్రచురణలో సవరించుకొంటాము.

ధర్మాచరణాసక్తులైన పాఠకులకు, వైదిక వృత్తిలోని మిత్రులకు ఈ గ్రంథం ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాము.

దీక్షి
కృష్ణ



వేదపురుష త్రివేది, వేదత్రికాండశ్రౌతి :
**కపిలవాయి రామశాస్త్రి**, ప్రధాన వేదపండితులు,
శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామి వారి
దేవస్థానం, అన్నవరం.

## అభినందన

శ్రీయుతులు ముత్య వీర వేంకట దీక్షితులు, పొన్నపల్లి వేంకట కృష్ణయ్య గారలు సంకలనము చేసిన "సమగ్ర ఆబ్ధిక ప్రయోగము" అను గ్రంథమును పూర్తిగా చదివితిని. వైదికులకందరకు ఉపయుక్తముగా ఉండుటకు సప్రమాణముగా, వివిధ శ్లోకములను శ్రుతి ప్రమాణములను పూర్వ గ్రంథముల నుండి సంగ్రహించి వీరు చాలా శ్రమపడి ఈ పుస్తకమును వ్రాసినారు.

ఈ గ్రంథమును పరిశీలనార్థం శ్రీ దీక్షితులుగారు నా మీద ఉండే అభిమానం చేత నాకు పంపించినారు. మొదటి వ్రాతపతిని ఆ మూలాగ్రం పరిశీలించినాను. నేను సూచించిన సవరణలు వారు చేసి మరల పంపించినారు. ఈ పుస్తకంలో అధిశ్రవణం, త్రిసుపర్ణములు కూడా ఉన్నాయి. ఈ గ్రంథం ఆధారం చేసుకొని ఆబ్ధికాదులు జరుపుకొనవచ్చును.

చాలామందికి అన్ని విషయములు తెలిసినను, ఇంకను తెలుసుకొనవలసిన విషయములు ఈ గ్రంథం ద్వారా తెలుసుకొనగలరని ఇందు మూలముగా తెలుపుకొనుచున్నాను. ఈ అవకాశము నాకు కల్పించిన రచయితలకు నా అభినందనలు తెలియజేస్తున్నాను. శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామివారి కృపచే వీరికి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగుగాక అని ప్రార్థిస్తున్నాను.

అన్నవరం
12-7-2007

**కపిలవాయి రామశాస్త్రి**



వేదభాష్య విభూషణ
**చిర్రావూరి శ్రీరామశర్మ**
17-31-17, టీచర్స్ కాలనీ,
రాజమండ్రి - 533 105.

# ఆమోదము

బ్రహ్మశ్రీ ముత్య వీర వేంకట దీక్షితులుగారు, బ్రహ్మశ్రీ పొన్నపల్లి వేంకట కృష్ణయ్యగారు సంకలనము చేసి శ్రాద్ధప్రయోగము నిర్దుష్టముగా ప్రయోక్తల కందించవలె ననుభావముతో చాలా శ్రమించిరి. ఇందు స్థానభేదముచే అలతి అలతి భేదములున్నను మూలము మాత్రము ఒకే రూపమున గలదు. దానిని స్ఖలింపజేయకుండుటతో బాటు స్థానిక భేదములను జతచేసి చాలా జాగరూకతతో దీనిని రూపొందించినారు. అంతేకాక ఆయా కాలములలో చేయదగిన విధానములు, నియమములు, కర్తవ్య విశేషములు, యాజ్ఞిక విధానములు ఇత్యాదుల నన్నింటిని పొందుపరచి ఈ ప్రయోగమును సంస్కరించి యున్నారు.

పుత్రులు తల్లిదండ్రుల విషయములో చేయదగిన మూడు కృత్యములు :

1. జీవతో వాక్యకరణాత్ - జీవించి యున్నంత వరకు వారి మాటను ఆచరించుట
2. ప్రత్యబ్ధం భూరి భోజనాత్ - ప్రత్యాబ్దికములను శ్రద్ధతో శాస్త్ర విహితముగా ఆచరించి, ఆ సమయమున అనేకులకు భోజనము ఏర్పాటు చేయుట
3. గయాయాం పిండదానేన - తన జీవితములో ఒకసారియైనను గయలో పితరుల నుద్దేశించి పిం[illegible]నము చే[illegible]

త్రిభిః పుత్రస్య పుత్రతా - ఈ మూడింటిని ఆచరించిన పుత్రుడు యోగ్యపుత్రుడగును (అని విధింపబడినది)

ఇందు మొదటిది వారి ప్రవృత్తిచే సాధ్యము. మూడవది ఎప్పుడో ఒకసారి చేయదగినది. మధ్యలో చెప్పిన ప్రత్యబ్ద కృత్యము సంవత్సరమున కొకసారి చేయదగినది. అందు లోపములు కలుగకుండా శ్రద్ధాపరులై ఆచరించు వారికై ఈ గ్రంథము అవశ్యము ఉపయోగించును. దీనికై వీరుభయులు మిక్కిలి శ్రద్ధ చేసి పలువురి చేత దీనిని శుద్ధపరచుటలో నన్ను కూడ ఒక సాధనముగా స్వీకరించినందున ఈ నాలుగు మాటలు వ్రాయవలసి వచ్చినది. ప్రత్యాబ్దిక విషయమున శ్రద్ధాపరులు ఈ గ్రంథము చదివి శక్తి గలిగినంతవరకు యధావిధిగా ఆచరించుట ద్వారా వీరి అతిశయితశ్రమను సఫలము జేయగలరని ఆశించుచున్నాను.

సర్వజిత్ నిజజ్యేష్ఠ శుద్ధ అష్టమి
భానువారము

చి. శ్రీరామశర్మ

## ఉపయుక్త గ్రంథాలు

1. ఆచార దీపిక
2. స్మృతిరత్నావళి
3. స్మృతిసారము
4. స్మార్త వివేచనిక
5. ధర్మసింధు
6. ధర్మప్రవృత్తి
7. వేంకట సోమయాజీయము
8. లక్ష్మీపతి సోమయాజీయము
9. వైదికాభరణము
10. యల్లాజీయము
11. యజుర్వేద ఆబ్దిక మంత్రము
12. యజుర్వేద ఆబ్దిక మంత్రము, క్రియ - పిశుపాటి మురళీకృష్ణ
13. ఆబ్దిక సర్వస్వము - మూర్తి వేంకట రామశర్మ మొదలైనవి.

## ఒకటవ ప్రకరణము

# ఆబ్దికాదులు

**ఉపోద్ఘాతము :**

మరణించిన వారి నుద్దేశించి వారికుమారులుగాని, కొన్ని సందర్భాలలో మరొకరుగాని ప్రతిసంవత్సరము వారు మరణించిన మాసంలో ఆతిథినాడు ఆచరించే కర్మకాండనే ఆబ్దికము, తద్దినము అనే పేర్లతో వ్యవహరిస్తారు. ఇవి కాక మొదటి సంవత్సరంలో ప్రతినెలా చనిపోయిన తిథినాడు ఆచరించేది మాసికము, మరికొన్ని ప్రత్యేక దినాల్లో ఆచరించేవి (త్రయపక్షికము, ఊనషాణ్మాసికము, ఊనాబ్దికము, సంవత్సరవిమోకము మొదలైనవి) కూడా ఉన్నాయి. వీటన్నింటినీ శ్రాద్ధములు అంటారు. ఇవన్నీ కూడా సాధారణంగా పార్వణ విధానంగా ఆచరిస్తున్నారు. ఇప్పుడు చెప్పుకోబోయేది చాలా వరకు వీటన్నింటికీ వర్తిస్తుంది. వీటిలో ఏవైనా తేడాలుంటే ఆయా సందర్భాలలో చెప్పబడతాయి.

శ్రాద్ధం రోజున పితృదేవతలు (మరణించిన వారి ఆత్మలు) మనోవేగంతో శ్రాద్ధం చేసే చోటికి వచ్చి భోక్తల ముఖంగా మరియు పిండప్రదాన విధానంగానూ ఆహారం గ్రహించి సంతృప్తి చెందుతారని మనవిశ్వాసం. పార్వణ విధానంగా జరిపే శ్రాద్ధంలో ప్రధానమైన అంశాలు అగ్నౌకరణం, పిండ ప్రదానం, బ్రాహ్మణ (భోక్తల) భోజనం. అనివార్య కారణాలవల్ల యథావిధిగా పార్వణ విధానంలో శ్రాద్ధం జరప లేకపోతే ప్రత్యామ్నాయంగా సంకల్ప శ్రాద్ధంగాని, ఆమశ్రాద్ధంగాని, హిరణ్యశ్రాద్ధం గాని చేయాలి.

## ఆబ్దిక తిథి నిర్ణయము

పంచాంగంలో ప్రతిరోజు ఆరోజున సూర్యోదయ సమయానికి గల తిథిని పేర్కొని ఆ తిథి ఎంతవరకు వ్యాపించిందో గంటలు నిమిషాలలో వివరిస్తారు. అంటే ఆతిథి ఆరోజు ఎప్పటిదాకా ఉంటుందో వివరిస్తారన్న మాట. క్రితం రోజున ముందరి తిథి అంత్యకాలం గుర్తించి, అప్పటి నుంచి ఈ రోజు ప్రస్తుత తిథి అంత్యకాలంవరకు తిథి వ్యాపించినట్లు గ్రహిం[illegible] ధారణ[illegible] గంటల

నుంచి 27 గంటల వరకు వ్యాపిస్తుంది. వ్యక్తి చనిపోయిన తిథి మాసాలు తెలిసి నప్పుడు తద్దినం ఏరోజు జరపాలో నిర్ణయించుకోవాలి. ముందుగా ఆతిథి ఎప్పుడు ప్రారంభమై (ముందరి తిథి అంత్యకాలం) ఎప్పుడు అంతం అవుతుందో గుర్తించాలి. ఏరోజున అపరాహ్ణకాలంలో ఆతిథి వ్యాపించిందో ఆ దినమున తద్దినం (ఆబ్దీకం) జరపాలి.

**అపరాహ్ణకాలం అంటే ఏమిటి ?**

ప్రతిదినము సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకుగల సమయాన్ని అయిదు సమాన భాగాలుగా చేయాలి. వాటి పేర్లు వరసగా 1. ప్రాతఃకాలము 2.సంగవకాలము 3. మధ్యాహ్న కాలము 4. అపరాహ్ణ కాలము 5. సాయంకాలము. ఇందులో నాలుగవదే అపరాహ్ణకాలము. ఉదాహరణకు ఒకరోజు ప్రొద్దున 6 గంటలకు సూర్యోదయమై సాయంత్రం 6 గంటలకు సూర్యాస్తమయమైతే ఆ రోజు పగలు 1-12 నుంచి 3-36 వరకు అపరాహ్ణకాలం అవుతుంది. ఉదయాస్తమయ కాలాలు పంచాంగంలో చూసి (దేశాంతర చక్రం ద్వారా సవరణ చేసుకుని) అపరాహ్ణ కాలం నిర్ణయించాలి.

చనిపోయిన తిథి ప్రస్తుతం ఏరోజున అపరాహ్ణ కాలంలో వ్యాపిస్తుందో ఆరోజే ఆబ్దికం పెట్టాలి. 1. ఏరోజునా అపరాహ్ణ కాలంలో వ్యాపించకపోతే అంటే మొదటి రోజు అపరాహ్ణ కాలం అయినతరువాత తిథి ప్రారంభమై మరుసటిరోజు అపరాహ్ణ కాలం మొదలు కాకుండా అంతమైతే అప్పుడు ముందు రోజున ఆబ్దికం పెట్టాలి. 2. తొలిరోజున అపరాహ్ణ కాలంలో తిథి ప్రారంభమై రెండవరోజు అపరాహ్ణ కాలంలో అంతమైతే ఏ రోజున ఎక్కువ సేపు అపరాహ్ణ కాలంలో ఆతిథి ఉన్నదో లెక్క చూసి ఆరోజున ఆబ్దికం పెట్టాలి. రెండు రోజుల అపరాహ్ణ కాలాలలోనూ తిథి సమానంగా వ్యాపిస్తే తిథి వృద్ధియందుంటే (తిథి ప్రమాణం రోజు రోజుకి పెరుగుతుంటే) రెండవ రోజున, తిథి క్షయమందుంటే (తిథి ప్రమాణం తరుగుతూ ఉంటే) మొదటి రోజున పెట్టాలి. ఇలాంటి సందిగ్ధావస్థ ఏర్పడినప్పుడు పంచాంగంలో ఆ రోజు ఏతిథి అనే సంగతి వ్రాస్తారు. అప్పుడప్పుడు ఒకేరోజున రెండుతిథులకు సంబంధించిన ఆబ్దికాలు రావటం, కొన్ని రోజులు ఆబ్దిక తిథులు కాకపోవడం జరుగుతుంది. వీటినే వరుసగా తిథి ద్వయం, శూన్యతిథి అని పిలుస్తారు. శూన్యతిథినాడు ఆబ్దికం మాసికం వంటి

శ్రాద్ధాలు పెట్టకూడదు కాని ఊనషాణ్మాసికము, సాంవత్సర విమోకము వంటివి పెట్టవచ్చును.

శ్రాద్ధదినం కర్తకు ఆశౌచముంటే ఆశౌచశుద్ధినాడు పెట్టాలి. (మాసికం ఆశౌచంలో పడితే తరువాత నెల మాసికంతో కలిపి పెట్టవచ్చని స్మృత్యర్ధసారంలో ఉన్నది) ఆశౌచ శుద్ధి రోజున శూన్యతిథి అయితే మరునాడు పెట్టాలి (శూన్యతిథి అయినా శుద్ధినాడే పెట్టాలని స్మృతిచంద్రికలో ఉన్నది) తిథితో నిమిత్తంలేని శ్రాద్ధం అయితే శూన్యతిథి అయినా ఆశౌచశుద్ధినాడే పెట్టాలి. మరేదైనా కారణంచేత (మరపు) ఆబ్దికానికి అంతరాయం వస్తే ఆ నెలలో బహుళ అష్టమి ఏకాదశి, అమావాస్యలలో పెట్టవచ్చు. కర్తకు ఆశౌచం లేకుండా గృహానికి ప్రసూతివంటి ఆశౌచాలు వస్తే వేరేచోట ఆబ్దికం పెట్టాలి. స్త్రీకర్తయై భర్తకు ఆబ్దికం పెట్టిస్తున్నప్పుడు "శ్రాద్ధార్ధం సంపాదితాః ... ముఖా భవంతు" అనే లోపున బహిష్టయితే 5వ రోజున పెట్టించాలి. ఆ తరువాత బహిష్ఠయితే ఆబ్దికం ఆపక్కరలేదు. (లక్ష్మీపతి సోమయాజీయం)

దేశాంతరంలో మృతి చెందిన వారి విషయంలో 1) మృతమాసం మాత్రం తెలిసి తిథి తెలియకపోతే కృష్ణఏకాదశి లేక అమావాస్య తిథిగా నిర్ణయించాలి. 2) తిథి మాత్రం తెలిసి మాసం తెలియకపోతే ఆషాఢ, భాద్రపద, మార్గశిర, మాఘ మాసాలలో దేనినైనా మృతమాసంగా నిర్ధారించి ఆబ్దికాలు పెట్టాలి. 3) తిథి, మాసం కూడా తెలియకపోతే ఇంటి నుంచి ఆవ్యక్తి బయలుదేరిన తిథి, మాసములను బట్టి మృతతిథిని నిర్ణయించాలి. దానినే ఆబ్దిక తిథిగా భావించాలి 4) అదికూడా తెలియకపోతే మృతి వార్త తెలిసినరోజే చనిపోయిన దినం (సమయంతో సహా) గా పరిగణించి, కర్మకాండ, మాసికాదులు తరువాత తద్దినాలు ఆ ప్రకారం పెట్టాలి. 5) ఎవరైనా దేశాంతరం వెళ్లి ఏ కబురూ లేకపోతే తల్లితండ్రులైతే (1) దేశాంతరం వెళ్ళే నాటికి 32 సం॥లోపు వయస్సయితే 21 ఏళ్లు (2) 32 నుంచి 63 వరకు అయితే 15 ఏళ్లు (3) 64 సం॥ ఆపైన అయితే 12 సం॥లు (4) తల్లిదండ్రులు కాకపోతే 12 సం॥లు వేచి ఉండాలి. తరువాత మృతి చెందినట్లు భావించి పాలాశవిధిని దహనాది కర్మలు చేసి శ్రాద్ధములు పెట్టాలి. (ఆచారదీపిక)

**మాసికాదులకు దిన నిర్ణయము :** చనిపో [illegible] రోజ [illegible] రణం చేసిన తరువాత కర్త స్నానం చేసి మొదటి [illegible] ట్టాలి [illegible] నుంచి

ప్రతినెలా చనిపోయిన తిథినాడు (తిథి నిర్ణయం ఆబ్దికానికి లాగానే) మాసికం పెట్టాలి. మృతుడు ఆహితాగ్ని అయితే 2వ మాసికం దహనతిథినాడు పెట్టి తరువాత మాసికాలు, ప్రత్యాబ్దికాలు మృతతిథినాడు పెట్టాలి. ఈ విధంగా మొత్తం 12 మాసికాలు (మధ్యలో అధిక మాసం వస్తే 13 మాసికాలు) అయిన తరువాత, చనిపోయిన సంవత్సరానికి అదే తిథినాడు మొదటి ఆబ్దికం పెట్టాలి. దానికి ముందు రోజున సాంవత్సర విమోకం అనే పేరుతో పార్వణ విధానంగా శ్రాద్ధం జరపాలి. ఇవికాక ఊనమాసికము, త్రైపక్షికము, ఊనషాణ్మాసికము, ఊనాబ్దికము అనే శ్రాద్ధాలు ఆచరించాలి. ఇవన్నీ కలిపి మొత్తం 16 శ్రాద్ధాలవుతాయి. అధికమాసం వస్తే 17 అవుతాయి.

త్రైపక్షికాన్ని మొదటి నెల కాగానే జరిపే రెండవ మాసికం తరువాత 1 నుంచి 5 రోజులలోగా పెట్టా . ఈ రోజులు ఆశౌచంలో పడితే 11 నుంచి 15వ రోజులలో ఒకనాడు పెట్టాలి. ( నషాణ్మాసికాన్ని ఆరవ నెలలో ఏడవ మాసికానికి 5 నుంచి 10 రోజులు ముం ఒకనాడు పెట్టాలి. ఊనాబ్దికాన్ని సాంవత్సరవిమోకానికి ముందరి 15 రోజు ో తొలి అయిదు రోజులలోగాని, చివరి 5 రోజులలోగాని ఒకనాడు పెట్టాలి. పై ప చెప్పిన త్రైపక్షికం రెండవ మాసికం తరువాత 1 నుంచి 5 రోజులలో చేస్తే ఊనాబ్దికాన్ని చివరి అయిదు రోజులలోను, త్రైపక్షికాన్ని 11-15వ రోజుల మధ్య చేస్తే ఊనాబ్దికాన్ని సంవత్సరం చివరి పక్షంలో మొదటి అయిదు రోజులలోను చెయ్యాలి. ఊనమాసికం మొదటి నెలలో 13,21,23,25,27,28, 29వ రోజులలో ఒకనాడు చెయ్యవచ్చును. ఈ ఊనములు మూడింటి విషయంలో కృత్తిక, ఆశ్లేష, పుబ్బ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రాలు లేని రోజులలో చెయ్యటానికి వీలైనంత వరకు ప్రయత్నించాలి అంతేకాని అటువంటి రోజు దొరకలేదని మానకూడదు. వీటికి అధికమాసం పట్టింపు, శూన్యతిథి పట్టింపు లేదు. అయితే ఊనములు శుక్రవారం పెట్టకూడదు. తల్లిదండ్రులకైతే పెట్టవచ్చు. కర్త భార్య బహిష్ఠు అయినా, స్త్రీ కర్త అయి ఆమె బహిష్ఠు అయినా అయిదవరోజు శుద్ధి వరకు ఏఊనము పెట్టకూడదు. వీటిలో దేనికైనా పై చెప్పిన నిర్ణీత సమయాల్లో పెట్టటానికి ఆటంకాలేర్పడి కుదరకపోతే అది మురిగిపోతుంది. ఆబ్దికం, మాసికాలకు అయితే కర్త భార్య బహిష్ఠఅయినా ఊరిలో లేకపోయినా లౌకికాగ్నిలో అగ్నౌకరణం

చేసి పెట్టాలి. ఈ సందర్భాలలో కూడా ఔపాసనాగ్నిలోనే అగ్నౌకరణం చేయడం ఆచారంగా ఉన్నది. సాంవత్సర విమోకం నాటికి కర్త భార్య బహిష్ఠు అయినా, స్త్రీ కర్త అయి ఆమె బహిష్ఠు అయినా ఆ శ్రాద్ధం మానెయ్యాలి.

## అధిక, క్షయమాసములు

ఒకవ్యక్తి చనిపోయిన తరువాత అబ్దికం పెట్టవలసిన ఏ సంవత్సరంలోనైనా ఆ వ్యక్తి చనిపోయిన మాసానికి అధిక మాసం వస్తే అధికమాసంలో ఆబ్దికం పెట్టక్కరలేదని కొన్ని గ్రంథాలలోఉన్నది. కాని అధిక మాసంలో కొందరు సంకల్ప విధానంగాను, నిజ మాసంలోలాగానే పార్వణ విధానంగాను ఆబ్దికం పెడుతున్నారు. మరుసటి సంవత్సరంలోనే అంటే సాంవత్సర విమోకం సమయానికే అధిక మాసం వస్తే దానిని, మొదటి ఆబ్దికాన్నికూడా అధిక మాసంలోనే పెట్టాలి. (హారీతః) ప్రథమాబ్దికం తిరిగి నిజమాసంలో కూడాపెట్టాలి. సంవత్సరంలోపుగా ఏదైనా అధిక మాసం వస్తే ఆఅధిక మాసంలో కూడా తిథినాడు మాసికం పెట్టాలి. ఆరవ నెల అధికమాసమైతే ఊనషాణ్మాసికం అధిక మాసంలోనే పెట్టాలి. ఒకవేళ ఎవరైనా అధిక మాసంలో చనిపోతే మరుసటి సంవత్సరం ఆ పేరుగల మాసంలోనే సంవత్సరీకాలన్నీ జరిపించాలి. అధిక మాసంలో చనిపోయిన వ్యక్తికి ప్రతి సంవత్సరమూ ఆపేరు గల మాసంలో మృతతిథినాడు ఆబ్దికం పెట్టాలి. మళ్లీ అదే మాసం అధికమాసంగా ఎప్పుడైనావస్తే అధికమాసంలో పార్వణ విధానంగా పెట్టాలి. అధికమాసంలో చనిపోయినవారికి 12వ రోజు సపిండీకరణం అయ్యాక ఊనమాసికాన్ని, నిజమాసంలో మృతతిథినాడు తొలిమాసికాన్ని, (దీనిని అన్వాద్యము అంటారు. ఇది ఈ సందర్భంలోనే వస్తుంది) మరుచటి నెలలో తిథినాడు రెండవ మాసికాన్ని, ఆ మర్నాటి నుండి 5 రోజులలోగాని 11వ రోజు నుంచి 15వ రోజులోగాని త్రైపక్షికాన్ని జరపాలి. వ్యక్తి చనిపోయిన తరువాత 12వ రోజులోగా అధికమాసం ప్రారంభమవుతే 12వ రోజున ప్రథమ మాసికంపెట్టి తరువాత మృతతిథినాడు అధికమాస మాసికం పెట్టి, పై నెలలో నిజమాస మాసికం పెట్టి ఆ తరువాత త్రైపక్షికం పెట్టాలి. 12 రోజుల తరు[illegible] ధికమాస[illegible] మవుతే, 12వ రోజున ఊనమాసికం, అధికమాసంలో [illegible] క మా[illegible] రువాత నిజమాసంలో మాసికము, అనంతరం త్రైపక్షి[illegible] లి.

ఒక వ్యక్తి చనిపోయిన మాసం తరువాత సంవత్సరాలలో క్షయమాసమైతే (అంటే మరొక మాసంతో కలిసి రెండు మాసాలుగా వ్యవహరింపబడితే) ఆ రెండు మాసాలలో మృతి చెందిన వారికి ఆ మాసంలోనే తిథినాడు ఆబ్దికం పెట్టాలి. ఎవరైనా క్షయమాసంలో పుట్టడంగాని, చనిపోవడంగాని జరిగితే తిథి వ్యాప్తకాలాన్ని రెండు సమభాగాలుగా చేసి మొదటి భాగంలో జరిగితే మొదటి మాసంలో జరిగినట్లు, రెండవ భాగంలో జరిగితే రెండవ మాసంలో జరిగినట్లు పరిగణించాలి. ఇది మాస నిర్ణయానికి మాత్రమే. ఈ మాస నిర్ణయం తరువాత సంవత్సరాలలో ఆబ్దిక సమయ నిర్ణయం కోసమే.

## భోక్త-లక్షణములు

శ్రాద్ధంలో బ్రాహ్మణ భోజనం ఒక ముఖ్యాంశము. సాధారణంగా ఇద్దరు బ్రాహ్మణులను భోక్తలుగా నియమించుకొని వారిని పూజించి భోజనం పెట్టాలి. పితృ (మాతృ) స్థానానికి ఒక భోక్తను విశ్వే దేవస్థానానికి ఒక భోక్తను నియమించు కోవాలి. పితృస్థాన భోక్త కర్తయొక్క తండ్రి (తల్లి), తాత (నాయనమ్మ), ముత్తాతను, (తాతతల్లి)లకు ప్రతినిధిగా భావించి, వారిని వసు, రుద్ర, ఆదిత్యరూపాలుగా పూజిస్తాము. విశ్వేదేవస్థాన భోక్త పురూరవ, ఆర్ద్రవ అనేపేర్లు గల దేవతలకు ప్రతినిధి. వీరు దక్షప్రజాపతి కుమార్తె విశ్వయొక్క 13గురు పుత్రులలో ఇద్దరు. కొన్ని గ్రంథాలలో విష్ణు స్థానంలో మరొక భోక్త ఉండాలని చెప్పబడినప్పటికీ ఎక్కువమంది ఈ సూత్రాన్ని పాటించడంలేదు.

**భోక్తగా తగనివారు :** భోక్తలిద్దరూ అన్నదమ్ములుగాని, తండ్రి కొడుకులుగాని కాకూడదు. కర్తకుగాని పెట్టేవారికిగాని సగోత్రుడుభోక్తగా పనికిరాడు, భార్య బహిష్ఠు అయినా, భార్య 6 నెలలు నిండిన (7వ నెల నుంచి) గర్భిణి అయినా, ప్రసవించి నెలపురుడు దాటకపోయినా, భార్య చనిపోయినా బ్రహ్మచారి అయినా ఆవ్యక్తి భోక్తగా పనికిరాడు. ముందు రోజు శ్రాద్ధం పెట్టినవాడు, భోక్తగా ఉన్నవాడు ఈ రోజు భోక్తగా పనికిరారు. మరునాడు శ్రాద్ధం పెట్టవలసినవాడు ఈ రోజు భోక్తగా పనికి రాడు. డబ్బు ఆశగలవాడిని, లోభిని, నగ్నశ్రాద్ధము, నవశ్రాద్ధము, ఆద్యశ్రాద్ధము వంటి వాటిలో ప్రేత స్థానంలో తిన్నవాడిని సపిండీకరణంలో గోదానం పట్టినవాడిని శ్రాద్ధంలో భోక్తగా పిలువరాదని ఆర్యోక్తి.

తల్లి పుణ్యస్త్రీగా (పునిస్త్రీ) చనిపోతే (కనీసం తండ్రి జీవించినంత కాలము) తల్లి ఆబ్ధికాలలో భోక్తలతో పాటు ఒక పుణ్యస్త్రీకి కూడా భోజనం పెట్టాలి. ఆ స్థానానికి గర్భవతి, ప్రసవించి నెల పురుడు దాటని ఆమె పిల్లలు లేని ఆమె వ్యాధిగ్రస్తురాలు, మరుగుజ్జు బహిష్ఠ అయి నాలుగు రోజులు పూర్తికాని (మారు నీళ్లుకాని) స్త్రీ, వృద్ధురాలు, కర్తకుగాని పెట్టేవారికి గాని సగోత్రురాలు పనికి రారు.

## భోక్తలను పిలిచే పద్ధతి

సాధారణంగా ఆబ్ధికాదులకు భోక్తలను పురోహితుడే ఏర్పాటు చేసి సమయానికి వాళ్లు వచ్చేటట్లు చూస్తాడు. కాని పూర్వకాలంలో గృహస్థుడే తన యింట్లో ఆబ్ధికానికి భోక్తలను స్వయంగా ప్రార్థించి నియమించుకోవటం జరిగేది. ఆ పద్ధతిని ఇక్కడ వివరిస్తాము.

ముందురోజు రాత్రి విశ్వేదేవస్థానంలో ఎవరిని భోక్తగా పిలవదలచామో వారి వద్దకు వెళ్లి వారి కుడిపాదం పట్టుకొని "శ్రాద్ధం భవితాతత్ర విశ్వేదేవార్థే భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః" అని చెప్పాలి. వారు అంగీకరించిన తర్వాత పితృస్థానంలో నియమించదలచిన వారి వద్దకు వెళ్లి కుడిపాదం పట్టుకుని ప్రాచీనావీతిగా (కర్త) "శ్రాద్ధం భవితాతత్ర పిత్రర్థే (మాత్రర్థే) భవద్భిః క్షణఃప్రసాదః కరణీయః" అని చెప్పాలి. పితృస్థానభోక్త జీవత్పితృకుడు (తండ్రి జీవించి ఉన్నవాడు) అయితే శ్రేష్ఠం అని పెద్దలంటారు. దీనినే భోక్తృనిమంత్రణం అంటారు. తిరిగి శ్రాద్ధం రోజు ఉదయం మళ్లీ అదే వరుసలో వారి వద్దకు వెళ్లి "అద్యశ్రాద్ధం కర్తవ్యం" అని చెప్పి మళ్లీ పైన చెప్పినట్లుగా నిమంత్రణం చెయ్యాలి. శ్రాద్ధంలో సంకల్పం కాగానే మళ్లీ 3వసారి నిమంత్రణం (పురోహితుడు చెప్పించగా) జరుగుతుంది.

నిమంత్రణం అంగీకరించిన భోక్తకు శ్రాద్ధం మొదలు కాకముందే ఆశౌచం సంభవిస్తే (ఇందులో భోక్త భార్య బయట ఉండటం కూడా జరగవచ్చు) మరొకరిని ద్వితీయ నిమంత్రణం ద్వారా నియమించుకోవా[illegible]డవ నిమ[illegible]రువాత భోక్తకు ఆశౌచ వార్త తెలిస్తే శ్రాద్ధం పూర్తి అ[illegible]శౌచ[illegible]అనగా భోక్తృత్త్వమునకు కూర్చున్న తర్వాత ఆశౌచ[illegible]వచ్చి[illegible]డదు.

నిమంత్రణ సమయానికే, భోక్తగా పిలువబడిన బ్రాహ్మణునికి పై చెప్పిన అనర్హతలేవైనా ఉంటే ఆ విషయం కర్తకు చెప్పి తాను రాలేనని చెప్పాలి. అప్పుడు కర్త వేరొకరిని నియమించుకుంటాడు.

ఒకభోక్త మాత్రమే దొరుకుతే సాగ్నికుడైన కర్త విశ్వేదేవస్థానంలో సాలగ్రామంగాని ఔపాసనాగ్నిగాని గంధం చెక్కనుగాని ఉంచి ఆబ్దికం జరపాలి. కర్త అనగ్నికుడు (బ్రహ్మచారి లేదా అపత్నీకుడు) అయితే దర్భ కట్టనుంచాలి. అసలు భోక్తలే లభించకపోతే రెండు రకాల కర్తలు రెండు స్థానాలలోను దర్భకట్టలుంచాలి. దర్భలకు సంఖ్యా నియమం లేదు. భోక్తలకుద్దేశించిన అన్నాన్ని అగ్నిలో హుతం చెయ్యటంగాని, గోవుకు పెట్టటంగాని చెయ్యాలి (ధర్మసింధు)

## భోక్తలు పాటించవలసిన నియమాలు

భోక్తగా వెళ్లటానికి అంగీకరించిన వ్యక్తి శ్రాద్ధం ముందురోజు, శ్రాద్ధంనాడు కూడా బ్రహ్మచర్యం పాటించాలి. శ్రాద్ధంనాడు క్షౌరము, తైలాభ్యంగనము, మరునాడు గోళ్లు తియ్యడం చేయకూడదు. ఒకరింట్లో భోక్తగా వెళ్లటానికి ఒప్పుకొని మరొకరి యింటికి భోక్తగా వెళ్లకూడదు. (అట్లా చేస్తే నరకం అనుభవించి నీచజన్మ ఎత్తుతాడట) అన్నశ్రాద్ధానికి భోక్తగా వెళ్లిన రోజే మరొకచోట ఆమశ్రాద్ధపు స్వయంపాకం తీసుకోకూడదు. (అట్లా చేస్తే ఆ భోక్త తాలూకు పితృదేవతలు నరకానికి పోతారట). వేరొకచోట జపము హోమము చెయ్యకూడదు. భోక్త ఆబ్దిక మంత్రం ఉచ్చరించ కూడదు. తాను చెప్పవలసిన మంత్రాన్నే (పురోహితుని సూచన ప్రకారం) ఉచ్చరించాలి. కర్త ఆచమనం చేయకముందు భోక్త ఆచమనం చేయకూడదు. కర్త తన చేయి పట్టుకుని అన్నం తాకించేదాకా అన్నం తాకకూడదు (తాకితే రౌరవాది నరకాలకి పోతాడట) ప్రాణాహుతులు తీసుకునేటపుడు పళ్లకుగాని నాలుక చివరిభాగానికి అన్నం తగ్గలకూడదు. పవిత్రం (దర్భ)తో ప్రాణాహుతులు తీసుకుని, తరువాత దానిని నేలపై ఉంచి, భోజనానంతరం ధరించి, చెయ్యికడుక్కున్నాక వదలిపెట్టాలి. భోక్తలు ఒకరినొకరు తాకకూడదు. అట్లా తాకితే దోషపరిహారంగా 108సార్లు గాయత్రీ మంత్రం జపించాలి (కొందరు 800 సార్లు అని చెప్పారు) ప్రమాదవశాత్తు ఒకరి ఎంగిలి మరొకరు తాకినా పైవిధంగానే చెయ్యాలి. (భోజనం

మానక్కరలేదు) భోక్త తనకు వడ్డించిన పదార్థాలు తప్ప వేరే పదార్థాలు అడగకూడదు. దేనినైనా మారు వడ్డించుమనిగాని వద్దనిగాని సైగలతో చెప్పాలిగాని నోటితో అడగకూడదు. పదార్థాలు రుచిగా ఉన్నాయనిగాని లేవనిగాని చెప్పకూడదు. సగంతిని విస్తరిలో వదిలేసిన భక్ష్యాలని (పిండివంటలని) మళ్లీ తీసుకుని తినకూడదు. వేడిగా ఉన్నవాటిని నోటితో ఊదుకుని తినకూడదు (చల్లారేదాకా ఆగాలి) ఎడమచేతితో అన్నం ముట్టుకోకూడదు. మంచినీళ్లు ప్రధానపాత్రలోంచి వేరే చిన్నగ్లాసులోకి తీసుకుని అవి పూర్తిగ తాగాలి. ప్రతిసారీ ఇలాగే చేయాలి.

భోక్త ఆచమనం చేసేటప్పుడు, ఆపోశనం తీసుకునేటప్పుడు, మంచినీళ్లు, నెయ్యి, పెరుగు, పరమాన్నం తీసుకునేటప్పుడు చప్పుడు చెయ్యకూడదు. పాదాన్ని ఏపాత్రకు తగిలించకూడదు. భోజనానికి ముందు 'బలిదానం' చేసే అలవాటుంటే భోక్తగా భోజనం చేసే రోజు అది మానెయ్యాలి. శ్రాద్ధం రోజున రెండవసారి భోజనం చెయ్యకూడదు. ఆనాడు వేదాధ్యయనం, తాంబూలసేవనం, దానం ఇవ్వటం, దానం తీసుకోవటం మానెయ్యాలి. దక్షిణ ఇంత కావాలని అడగటంగాని, ఇచ్చిన దక్షిణ చాలదనటంగాని కూడదు.

మాసికం అయితే 800 సార్లు, ప్రథమాబ్దికమైతే 300 సార్లు ఊనాబ్దికం అయితే 1000సార్లు, ప్రతి సంవత్సర ఆబ్దికం అయితే 100 సార్లు భోక్త గాయత్రి మంత్ర జపం చెయ్యాలి. మండలాద్యర్చనం తరువాత భోక్త మండలమునకు ఉత్తర దిక్కునుండి ఆచమనము చేయాలి. అట్లా చేస్తే అమృతముతో సమానమని అంటారు.

## కర్త పాటించవలసిన నియమాలు

శ్రాద్ధానికి ముందురోజు రాత్రి కర్త భోజనం చెయ్యకూడదు. మడిగా ఫలహారం చెయ్యవచ్చును. ముందురోజున, శ్రాద్ధంనాడు మరుసటినాడు బ్రహ్మచర్యం పాటించాలి. క్షౌరం, గోళ్ళు తీసుకోవటం అభ్యంగనం కూడదు. గంధము వంటి అలంకారము, కంఠమాలలు ధరించకూడదు. తద్దినంనాడు ఉదయం చన్నీటితో స్నానంచేసి సంధ్యావందనాది నిత్యకర్మలు చెయ్యాలి. అస్వస్థుడైతే వేడి నీటి స్నానం చెయ్యవచ్చును.

భోక్తలు వచ్చిన తరువాత మళ్లీ స్నానం [illegible] ఆర[illegible] [illegible]ట్టలు (పంచె, ఉత్తరీయము) ధరించాలి. పంచెలుం[illegible] [illegible] పెట్టి [illegible] బిళ్ళ

గోచీ పెట్టి కట్టాలి. తడిబట్టలు ధరించకూడదు. రంగుబట్టలు ముఖ్యంగా ఎర్రనివి శ్రాద్ధం పెట్టే సమయంలో ధరించకూడదు. ఆనాడు ప్రొద్దుటి నుంచీ మౌనంగా, శుభ్రమైన వస్త్రాలు ధరించి ఉపవాసం ఉండాలి (శ్రాద్ధం పూర్తి అయ్యే వరకు) ఔషధం (మందు) కూడ వేసుకోకూడదు. శ్రాద్ధం పూర్తి అయినాక పితృశేషం భుజించటం తప్ప మరోసారి భోజనం కాని, ఫలహారంగాని చెయ్యకూడదు. తాంబూలం, వేదాధ్యయనం, దానం చెయ్యటం, పుచ్చుకోవడం మానెయ్యాలి. కర్త ఏకారణం చేతనైనా అశక్తుడైతే అతని ప్రతినిధిగా తద్దినం పెట్టేవారికికూడా ఈ నియమాలన్నీ వర్తిస్తాయి (ప్రతినిధిగా పుత్రుని కూడ నియమించవచ్చు)

ఆచమనం చేశాకగాని పవిత్రం ధరించకూడదు. అర్ఘ్యం, గంధం భోక్తల కిచ్చేటప్పుడు, భోక్తల కాళ్లు కడిగేటప్పుడు, పార్వణం కలిపేటప్పుడు పవిత్రం ధరించకూడదు.

పితృశేషాన్ని కుటుంబ సభ్యులకు, అభ్యంతరం లేని బంధువుల (మృతవ్యక్తి దౌహిత్రాదులు)కు తప్ప ఇతరులకు పెట్టకూడదు. ముఖ్యంగా శూద్రులకు పెట్టకూడదు (అట్లా చేస్తే పితృదేవతలకు నిరాశ కలుగుతుంది)

## శ్రాద్ధము రోజు పాటించవలసిన నియమాలు

శ్రాద్ధ దినాలలో గదులు, హాలు మొదలైనవి ఆవుపేడతో అలికించాలి. గచ్చు అయితే కడిగించాలి. అలాగే వీధిగుమ్మము కడిగించాలి. ఎక్కడా ముగ్గు పెట్టకూడదు. శ్రాద్ధంనాడు వేడి నీటితో స్నానము చేయకూడదు. శ్రాద్ధంనాడు ఆ గృహమందు శూద్రునికి భోజనము, శ్రాద్ధ శేషములను పెట్టకూడదు. ఒకవేళ ముందుగా శూద్రునకు పెట్టి తరువాత యజమాని తింటే పితృదేవతలు నిరాశగా వెళ్ళిపోతారు. ఆబ్దీకము రోజున అరటి చెట్టును నరికితే పితృదేవతలు ఆశారహితులై వెళ్ళిపోతారు. ముష్టి (బిచ్చము) వేయకూడదు. శ్రాద్ధముకాకుండాదేవునికి నైవేద్యము పెట్టడం పిల్లలకు ముసలివారికి తినేందుకు ఏదైనా పెట్టడం పనికిరాదు. శ్రాద్ధముపెట్టే గదిలో కత్తి పీట ఉంచకూడదు. శ్రాద్ధమునకు తెచ్చిన వస్తువులు శ్రాద్ధము పూర్తి అయ్యేవరకు ఇతరత్రా వాడకూడదు. గంధము సానపై అపసవ్యముగా తీయాలి. గంట మ్రోగించకూడదు. స్టౌవు, సిలెండరు, వంటపాత్రలు కడిగి శుభ్రపరచి వాడాలి. కుంపటిబొగ్గులు, కట్టెలపొయ్యి మీద వంట చేయుట మంచిది.

# కూర్చ, పవిత్రము

శ్రాద్ధ కర్త 'పవిత్రం' అనే దాన్ని ఉంగరం వేలు మీద ధరించి శ్రాద్ధం ఆచరించాలి. అట్లాగే 'కూర్చ'ను తన జలపాత్రలో ఉంచుకోవాలి. వీటిని దర్భలతో తయారుచేస్తారు.

పవిత్రం మొదలు 2 అంగుళాలు ముడి 1 అంగుళము అగ్రము 4 అంగుళాలు ఉండాలి. ప్రేతకర్మకు 1 దర్భతోను నిత్యకర్మలకు 2 దర్భలతోను ఆబ్దికాదులకు 3 దర్భలతోను పవిత్రం తయారుచెయ్యాలి.

మొదటి ఆబ్దికం (సాంవత్సర విమోకం తరువాత వచ్చేది) కోసం 5 దర్భలతోను ప్రతి సంవత్సరం జరిపే తద్దినానికి 7 దర్భలతోను, తీర్థశ్రాద్ధము మహాలయములకు 9 దర్భలతోను మాసికానికి 11 దర్భలతోను, సాపిండ్యానికి 12 దర్భలతోను కూర్చ తయారుచెయ్యాలి.

శ్రాద్ధం ఆచరించేటప్పుడు కర్త ఉంగరపు వేలికి పవిత్రం ధరించాలి. విచ్ఛిన్నోపాసనకాగానే ఆచమనం చేసి ఒక పవిత్రం ధరించాలి. భోక్తల పాదప్రక్షాళన అయిన తరువాత మండల ప్రదేశంలో మొదటి పవిత్రం విడిచి రెండవ పవిత్రం ధరించాలి. దీనిని వికిరపిండానంతరం విడవాలి. పింద ప్రదాన ప్రారంభంలో మూడవ పవిత్రం ధరించాలి. దీనిని ఆఘ్రాణాంతంలో విసర్జించాలి. మార్జనాది యందు ధరించిన నాలుగవ పవిత్రాన్ని పిండోద్వాసన సమయంలో వదిలిపెట్టాలి. ఆసీమాంతం సమయంలో ధరించే ఐదవ పవిత్రాన్ని భోక్తలకు దక్షిణ ఇచ్చిన తరువాత వదలాలి. ప్రార్ధనకు ముందుగా ధరించే పవిత్రాన్ని నమస్కారాంతంలో విడిచి పెట్టాలి. ఒక పవిత్రం విడిచాక మరొక పవిత్రం ధరించే ముందు ధరించిన తరువాత ప్రతిసారీ ఆచమనం చెయ్యాలి.

ఈ విధంగా యజుశ్శాఖీయులు 6సార్లు పవిత్రం ధరించాలి. కాని ఆబ్దికం ఆరంభంలో రెండు పవిత్రాలనుజమిలిగా ధరించి చివరలో ఆ రెండింటిని కలిపి విడిచిపెట్టటం ఆచారంగా వస్తూంది. కొందరు [illegible] ఒకటి, [illegible]చ్చాక మరొకటి మాత్రమే ధరిస్తున్నారు. పవిత్రం లేకుం[illegible] [illegible]మల[illegible] [illegible]లను జలపాత్రలో ఉంచుకొని ఆపని అవగానే తిరిగి [illegible]ంచా[illegible]

## దొన్నెలు

ఆబ్దికాదులకు 11 దొన్నెలు అవసరం అవుతాయి. ఇందులో రెండు భోక్తల భోజనంలో నేతికి, ఒకటి అగ్నౌకరణం తరువాత పితృపాత్రగా ఉపయోగించటానికి, తిలలు ఉంచటానికి ఒకటి, యవలు (కడిగిన బియ్యం) ఉంచటానికి ఒకటి, విచ్ఛిన్నాపోసనలో నేతికి ఒకటి, అర్ఘ్యపాత్రలుగా అయిదు వాడాలి. ఇందులో విశ్వేదేవస్థానంలో రెండు అర్ఘ్యపాత్రలు (దొన్నెలు) 4 అంగుళాలు పొడవు, వెడల్పు, లోతుగాను పితృస్థానంలో మూడు దొన్నెలు 5 అంగుళాలు పొడవు, వెడల్పు, లోతు గాను చెయ్యాలి. మిగిలిన దొన్నెలకు కొలత నియమంలేదు. ఈ దొన్నెలు సాధారణంగా అరిటాకుని చీల్చి అందులోనుంచి రెండు ముక్కలు (పర్ణాలు) తీసుకుని మడిచి కొత్త కొబ్బరిఆకు ఈనెలతో కుట్టాలి. లేకపోతే మర్రి ఆకులు (పూర్తి ఆకులు) వాడవచ్చు.

## వంట

శ్రాద్ధంలో భోక్తలకు వడ్డించేందుకు చేసే వంటకాలలో సరిసంఖ్యలో కూరలు, (కలగలుపు కూరలు పనికిరావు) పచ్చళ్లు పిండివంటల రకాలు ఉండాలి. ఆంధ్ర దేశంలో ఆచారంగా పెసరపప్పు, నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్లు, నువ్వులపొడి లేదా నువ్వులపచ్చడి ముఖ్యం) గారెలు, అరిసెలుగాని అప్పాలుగాని తీపివంటకం, నువ్వుండలు, బెల్లం, పాలు, బియ్యములతో చేసిన పరమాన్నం, చారు, వండటం ఆచారంగా ఉంది. ద్రావిడుల ఇళ్లలో చారు బదులు పులుసు వండుతారు. ఇవి కాక పెరుగు కూడ వడ్డిస్తారు. అరటిపండుగాని, మామిడిపండుగాని, కోసిన మామిడిపండు ముక్కలుగాని, అనాసపండు ముక్కలుగాని పెరుగు అన్నంతో తినడానికి వడ్డిస్తారు (ఆయా కాలాల ననుసరించి) ఉప్పుకూడా విడిగా ఏ పదార్థానికి తగులకుండా వడ్డించాలి.

మజ్జిగ పనికిరాదు. పెరుగే వడ్డించాలి. కూరలలో ఒక దుంపకూర, ఒక ఆకుకూర (తోటకూర వంటిది) ఉండాలి. కందవంటి దుంపకూర చేసినట్లయితే దుంప పూర్తిగా కొని తేవాలిగాని ముక్క కొనకూడదు (అవసరం మేరకే వాడవచ్చు) అట్లాగే పనసపొట్టు కూర చెయ్యదల్చుకుంటే పూర్తి పనసకాయ కొని తెచ్చి కావలసి నంత పొట్టు చేసుకోవాలి గాని, పనసకాయముక్క లేదా చేసిన పొట్టు కొనకూడదు. కొబ్బరికాయ ఆరోజునే కొట్టాలి. పనసతొనలు వడ్డించదల్చుకుంటే పూర్తి పండుకొని తొనలు తీసి వడ్డించాలిగాని, చెక్క, తొనలు కొనకూడదు. శ్రాద్ధానికి ఉపయోగించిన

కంద, పనసకాయ, పనసపండు, కొబ్బరికాయలలో మిగిలిన వాటిని శ్రాద్ధానంతరం మాత్రమే ఇతరత్రా వాడాలి. గారెలకు మినపప్పుని ఆ రోజు ఉదయం మడిగా నానపెట్టాలి గాని ముందు రాత్రి నానబెట్టకూడదు. పూర్వం దంపుడు బియ్యం వాడే రోజులలో ఆ రోజు ఉదయం ధాన్యం దంచి ఆ బియ్యాన్నే వంటకు వాడేవారు.

ఇకపోతే కొన్ని పదార్థాలు వాడటం నిషిద్ధం. వంకాయ, ఉల్లి, వెల్లుల్లి, జీలకర్ర, పొట్లకాయ, మసాలా దినుసులు, క్యాబేజి, క్యారట్, కాలీఫ్లవర్, టొమేటో, తయారైన మరమరాలు, అటుకులు, సేమియా, సగ్గుబియ్యం వంటివి వాడకూడదు. శనగపప్పు, కందిపప్పు, బొబ్బర్లు, మసూర్‌డాల్ వంటి పప్పులు వాడరు. మృతవ్యక్తి కాశీ గయలలో వదలిపెట్టిన కాయగూరలు, పళ్లు వాడకూడదు.

సాధారణంగా తోటకూర, పనసపొట్టు, అరటికాయ, కంద, చేమదుంప, దొండకాయ, బెండకాయ, కాకరకాయ, ఆగాకరకాయ, చిక్కుడుకాయ వంటివి కూరలకు, కొబ్బరికాయ, నువ్వు పప్పు, అల్లం, మామిడికాయ, దోసకాయ, బలుసుకూర, నిమ్మకాయ (దబ్బకాయ పనికిరాదు) ఎండిన వేపపువ్వువంటివి పచ్చళ్లకు వాడతారు. పెసరపప్పు వండి కొంచెం ఉప్పువేసి వడ్డిస్తారు గాని కలగలుపు పప్పు చెయ్యరు. పోపులో ఆవాలు, మినపప్పు, ఎండుమిర్చి మాత్రమే వాడతారు. చింతపండు వాడతారు గాని పులుసు కాచరు. చారుమాత్రమే కాస్తారు. దేశాచారాన్ని బట్టి ఏయే కూరలు, పప్పులు వాడకూడదో, ఏవి వాడవచ్చో తెలుసుకుని వంట చెయ్యాలి.

కర్త లేక అతని భార్య వంట చెయ్యటం శ్రేష్ఠం. అనారోగ్య కారణాలవల్లగాని, బహిష్ఠ అయ్యే అనుమానం ఉంటేగాని వేరొకరిని నియమించుకోవచ్చు. కన్యగాని, సకేశ అయిన వితంతువుగాని వంటకు పనికిరారు. వంట ప్రారంభం మాత్రం కర్త లేక అతని భార్య చెయ్యటం ఉత్తమం. అట్లాగే వడ్డన కూడా వీలైతే కర్త లేక అతని భార్య చెయ్యటం ప్రశస్తం. ఈ సమయంలో వంట చేసేవారు శిరస్నానం చేసి (కచ్చాపోసిగాని, గోచీగాగాని) తెల్లమడి చీర, తెల్లరవిక ధరించి బొట్టు పెట్టుకోకుండా ఉండాలి. జుట్టు వదిలేయకూడదు. ముడి వేసుకోవాలి. ఏడుపు, నవ్వు, అకారణ భాషణ చెయ్యకూడదు. భోక్తలవిస్తళ్లు తీసేందుకు పురోహితుడు సూచించినప్పుడు బొట్టు పెట్టుకుని విస్తళ్లు తీయాలి.

పితృశేషం జ్ఞాతులు, పక్షిణీదారులు, తినవచ్చు. బ్రహ్మజ్ఞాని, యోగి, వారి భార్యల పితృశేషాన్ని అందరూ తినవచ్చు.

# రెండవ ప్రకరణము

# విచ్ఛిన్నౌపాసన

**ఉపోద్ఘాతము :**

ఆహితాగ్నులు కాని వారు అవసరమైనప్పుడు అగ్నిని ప్రతిష్ఠించి హోమాలు చేస్తారు. ఆ అవసరం తీరిన తరువాత ఆ అగ్ని ఆరిపోతుంది. అంటే విచ్ఛిన్నం అవుతుందన్నమాట. విచ్ఛిన్నమైన అగ్నిని తిరిగి ప్రతిష్ఠించి, అవసరమైన హోమాలు చేసి శ్రాద్ధంలో చేసే అగ్నౌకరణానికి అగ్నిని సిద్ధం చేసుకోవాలి. దీనినే విచ్ఛిన్నౌపాసనము అంటారు. శ్రాద్ధం పూర్తి అయ్యేవరకు ఈ అగ్ని ఆరకూడదు. మధ్యలో ఆరితే కర్త ఆ రోజు ఉపవసించి మర్నాడు తిరిగి శ్రాద్ధం పెట్టాలి (స్మృతి రత్నావళి)

ఆహితాగ్నులైన వారు ప్రతిరోజు హోమాలు చేస్తారు. అందుచేత వారిళ్లలో ఎల్లప్పుడూ ఔపాసనాగ్ని ప్రజ్వరిల్లుతూంటుంది. ఆ అగ్నిలోనే శ్రాద్ధంలోని అంశమైన అగ్నౌకరణం చేస్తారు. అందువల్ల వీరు ప్రత్యేకించి విచ్ఛిన్నౌపాసనం చెయ్యనక్కర్లేదు.

తల్లిదండ్రులు, భార్య, సోదరులు, పితృసోదరులు పితామహీ పితామహులు, మాతామహీ మాతామహులు వీరికి తాను కర్త అయి ఆబ్దికాదులు పెడితే విచ్ఛిన్నౌపాసన చెయ్యాలి. తక్కిన సందర్భాలలో లౌకికాగ్నిలోనే అగ్నౌకరణం చెయ్యాలి. కర్త బ్రహ్మచారి అయినా అపత్నీకుడయినా, వేరే ఇంట్లో భార్య దగ్గర లేకుండా ఆబ్దికం పెడుతున్నా, భార్య నుంచి విడిపోయినా లౌకికాగ్నిలోనే అగ్నౌకరణం చెయ్యాలి. ఈ సందర్భాలలో విచ్ఛిన్నౌపాసన ఉండదు. భార్య సమీపంలో లేనప్పుడు కూడా కొందరు ఔపాసనాగ్నిలో అగ్నౌకరణం చేస్తున్నారు.

సోదరులు సమిష్టిగా పెట్టే ఆబ్దికం సందర్భంలో జ్యేష్ఠుడు మాత్రమే విచ్ఛిన్నౌపాసన, అగ్నౌకరణము చెయ్యాలి. జ్యేష్ఠుడు అపత్నీకుడైతే తమ్ములలో ఎవరి భార్య అక్కడ ఉంటే వారు (క్రమపద్ధతిలో) విచ్ఛిన్నౌపాసన, అగ్నౌకరణము చెయ్యాలి. వీటిలో తక్కిన సోదరులు పాల్గొనకూడదు. తక్కిన శ్రాద్ధమంతా జ్యేష్ఠుడే ఆచరించాలి. (యల్లాజీయం)

ముందుగా కర్త చన్నీటితో తలస్నానం చేసి తెల్లమడిపంచ (ఎఱ్ఱ అంచు కానిది) బిళ్లగోచిగా ధరించి ఉత్తరీయం (కండువా లేక తువ్వాలు) ఎడమ భుజంపైన వేసుకొని, ఆసనం మీద తూర్పుముఖంగా కూర్చుని, విభూతి ధరించి నిత్యానుష్ఠానాలు పూర్తి చేసుకొని విచ్ఛిన్నోపాసన ప్రారంభించాలి. ఈ విచ్ఛిన్నోపాసన ఉదయమే చెయ్యటం ముఖ్యపక్షము.

**విభూతి ధరించు పద్ధతి :**

ఎడమ అరచేతిలో విభూతి ఉంచి కొంచెం తడిచేసి కుడిచేతి మధ్య, ఉంగరపు వేళ్లతో ఎడమనుంచి కుడికి రేఖలు (మధ్య ఖాళీ ఉండేటట్లు) గీయాలి. తరువాత బొటనవేలితో ఈ రెండు రేఖల మధ్య కుడినుంచి ఎడమకు గీయాలి. ఈ మూడు రేఖలూ నుదుటిమీద పూర్తిగా రావాలి. లేదా ఒకేసారి ఎడమనుంచి కుడికి చూపుడు, మధ్య, ఉంగరపు వేళ్లతో మూడు రేఖలుగా ధరించవచ్చు.

**విచ్ఛిన్నోపాసన ప్రారంభము :**

ఆచమనమునకు రాగి, కంచు లేదా ఇత్తడి చెంబుతో నీళ్లు, ఒకగ్లాసు, ఉద్ధరణి, హరివాణము (పళ్లెము) సిద్ధం చేసుకోవాలి. స్టీలువి పనికిరావు.

ఆచమ్య – ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా ఈ మూడు నామాలకీ మినపగింజ మునిగేటంత ఉదకమును ఉద్ధరణితో కుడిచేతిలోనికి తీసుకొని బ్రహ్మతీర్థం ద్వారా ఆచమనం చెయ్యాలి. అనగా చప్పుడు కాకుండా నోటిలోనికి గ్రహించాలి. (అరచేతిలో బ్రహ్మతీర్థం ఎక్కడుంటుందో పటంద్వారా తెలుసుకోవచ్చు) ఈ సమయంలో చూపుడు, మధ్యవేళ్ల నడుమ బొటన వేలుండేటట్లు చేతిని ఉంచాలి. చెయ్యి మోకాలు దాటి బయటకు రాకూడదు. **ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూదనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయ నమః, ఓంనారసింహాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్ధనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః ఓం శ్రీ [illegible] నమః**

పై అచమన విధానాన్ని పురాణాచమనం అంటారు.

**భూతోచ్చాటన :**

**ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః । యేతే భూమి భారకాః ।**
**ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥**

(పై మంత్రమును చదువుతూ వెనక్కి నీళ్లు చల్లాలి.)

1. ఋషితీర్థము – ఋషితర్పణమునకు చిటికెన వేలు మొదట.
2. పితృతీర్థము – పితృతర్పణమునకు చూపుడువేలు మొదట.
3. బ్రహ్మతీర్థము – ఆచమనమునకు బొటనవేలు మొదట.
4. దేవతీర్థము – అర్ఘ్యాదులకు వేళ్ల కొసలు
5. అగ్నితీర్థము – దేవతర్పణమునకు అరచేతి మధ్యలో దేవ, పితృ, ఋషులకు తీర్థం విడిచేటప్పుడు అరచేతి మధ్య జలముంచి ఆయా తీర్థస్థానాల మీదుగా వదలాలి. ఆచమనం బ్రహ్మతీర్థం మీదుగానే చెయ్యాలి.




**ప్రాణాయామము :**

ప్రాణాయామ మనగా శ్వాసను నియంత్రించుట. ప్రాణాయామము చేయుటలో మూడు అంచెలు యిమిడియున్నవి.

1. పూరకము అనగా గాలిని లోపలికి పీల్చుట. (ఎడమ ముక్కుద్వారా గాలి పీల్చాలి)

2. కుమ్భకమనగా ఆ పూరించిన గాలిని కదలనీయక నిలుపుట.

3. రేచకమనగా శరీరములోని గాలిని కుడి ముక్కు రంధ్రముద్వారా మెల్లగా బయటకు వదలుట.

**ప్రాణాయామము చేసే విధము :** ప్రాణాయామము చేసేటప్పుడు వెన్ను, కంఠము, శిరస్సు ఈ మూడు ఏకదణ్డముగా నిలిపి వంగకుండా కూర్చొవాలి. కుడిచేతి బొటనవ్రేలితో కుడిముక్కు రంధ్రమును మూసి ఎడమముక్కుతో నెమ్మదిగా గాలిని శ్వాసకోశమందు 4 సెకండ్లు పూరించాలి. తరువాత 16 నుంచి 30 సెకనులు శ్వాస బిగించి గాలిని లోపల నింపాలి. తరువాత 8 నుంచి 10 సెకనులు గాలిని నెమ్మదిగా కుడిముక్కుతో వదలాలి. తరువాత ఎడమ ముక్కు రంధ్రమును కుడిచేయి బొటనవ్రేలితో మూసి నాలుగు సెకనులు కుడిముక్కుతో గాలిని నెమ్మదిగా శ్వాసకోశ మందు పూరించాలి. తరువాత కుంభకము చేయకుండా అనగా శ్వాస బిగించకుండా నెమ్మదిగా 8 సెకనుల కాలము శ్వాస వదలాలి. తరువాత పూరించకుండా 16 సెకనుల కాలము ఊపిరి బిగపట్టాలి. ఇది ఒక పద్ధతి.

భూతోచ్చాటన అనంతరం పైన చెప్పిన ప్రాణాయామం చేస్తూ కింది మంత్రం మూడుసార్లు చెప్పుకోవాలి.

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యమ్। ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్। ఓమాపోజ్యోతీర సోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥

**సంకల్పము :**

మమ (అని కర్త అనాలి) ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే, శ్వేత వరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే కృష్ణా, గోదావర్యోర్మధ్యదేశే స్వగృహే (అద్దె ఇల్లయితే వసతి గృహే అనాలి) సమస్త దేవతా బ్రాహ్మణ హరి హరగురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన, వ్యావహారిక చాంద్రమానేన ... నామ సంవత్సరే .... ఆయనే .... ఋతౌ .... మాసే .... పక్షే .... తిథౌ ... వాసరే శుభనక్షత్రే .... శుభయోగే శుభకరణ ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ ... గోత్రః .... నామధేయః ....... (ఉ )ధర్మపత్నీసమేతః శ్రీమతః ..... గోత్రస్య .... నామధేయస్య (ఉ )ధర్మపత్నీ

సమేతస్య మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం విచ్ఛిన్నౌపాసనాగ్నిం పునస్సంధాస్యే ।

**క్రియ :** కుడిచేతిలోకి నీళ్లు తీసుకొని పళ్లెంలో వదలాలి.

**గమనిక :** 1) శ్రీశైలానికి ఏ దిక్కున ఉంటే ఆ దిక్కుని చెప్పాలి. అట్లాగే ఏ రెండు నదుల మధ్య ఉంటే ఆ నదుల పేర్లు చెప్పాలి. 2) బ్రహ్మచారులు, అపత్నీకులు. ధర్మపత్నీ సమేతః ధర్మపత్నీ సమేతస్య అనునవి చెప్పకూడదు.

**విచ్ఛిన్నౌపాసన :**

హోమం చేసే చోట ముందుగా మూరెడు పొడవు చతురస్రాకారంగా ఇసుకతిన్నె చెయ్యాలి. కొద్దిగా నీళ్లు చల్లాలి.

**సూ॥** యత్రాగ్నిస్థాప్యతే తత్ర శ్వేతతణ్డులచూర్ణేన ప్రాదేశమాత్రం చతురశ్రం స్థణ్డిలం కల్పయిత్వా ॥

**క్రియ :** ఇసుకతిన్నె మధ్యగా అరచేతిని విస్తరించినప్పుడు బొటనవ్రేలు చూపుడువ్రేళ్ల మధ్య గల దూరము ప్రమాణంతో చతురస్రముగా బియ్యపు పిండి పరవాలి. దీనినే స్థండిలం అంటారు.




**సూ॥ ద్వాభ్యాందర్భాభ్యాముల్లిఖ్య ।**

**ప్రాచీఃపూర్వముదక్సంస్థం దక్షిణారమ్భ మాలిఖేత్ ।**

**అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్ ॥**

**అవాక్కరోభ్యుక్ష్య ॥**

**క్రియ :** స్థండిలం మీద తూర్పువైపునకు 3 గీతలు, ఉత్తరము వైపునకు 3 గీతలు కింద సూచించినట్లు గీయాలి (పటం చూడండి)

రెండు దర్భలను తీసుకొని బొటన, ఉంగరపు వ్రేళ్ళతో పట్టుకొని వంకర లేకుండా దర్భల మొదళ్ళతో ఒకగీత, అగ్రములతో రెండు గీతలను తూర్పుదిశగా దక్షిణంవైపున ప్రారంభించి గీయాలి. అదే విధంగా ఉత్తర దిశగా పశ్చిమంవైపున ప్రారంభించి గీయాలి. తరువాత ఆ దర్భలు, అక్షతలు, ఉదకము తీసుకొని చేయి

బోర్లించి అక్షతలు, ఉదకము వరిపిండిపై చల్లి దర్భలను నిలువుగా చీల్చి అగ్నిహోత్రమునకు వెలుపల నైఋతి దిక్కుగా ఉంచి ఉదకము ముట్టుకోవాలి. ఇప్పుడు కర్త భార్య అగ్ని (కణకణలాడే బొగ్గులు) తేవాలి. ఒక ఇత్తడి పళ్లెంలో అగ్నినుంచి మరొక ఇత్తడిపళ్లెం దానిపై బోర్లించి హోమస్థలానికి ఉత్తరం వైపున (ఈ పాత్రలు దారిలో పడిపోతే వాటిని నీళ్లలో పడేసి వేరే పళ్లెములతో అగ్ని తేవాలి. తరువాత రెండు ప్రాయశ్చిత్త హోమాలు చెయ్యాలి)

**గమనిక :** కర్త భార్య (సోదరులు సమిష్టిగా జరిపేటప్పుడు జ్యేష్ఠుడి భార్య) బహిష్టు అయి నాలుగోరోజు దాటకపోయినా, ప్రసూతి అయి నెలపురుడు దాటక పోయినా, అస్వస్థురాలైనా, దూరప్రాంతంలో ఉన్నా కర్తయే అగ్నిని సృష్టించాలి (ఉదా : కర్పూరం వెలిగించి) ఈ సందర్భాలలో ప్రాతరౌపాసన (తండుల హోమం) చెయ్యకూడదు (స్మృతిసారం)

**మం. భూర్భువస్సువరోం**

**సూ॥ నిధాయ వహ్నిమ్ । ఉత్సిచ్య తేఽ_వోక్షణ తోయ శేషమ్ ।**

క్రియ - కర్త మూతను తీసి అగ్నియున్న పళ్ళెమును అగ్ని తనకు ఎదురుగా ఉండునట్లు పట్టుకొని "భూర్భువస్సువరోమ్" అని అంటూ వరిపిండిపై అగ్ని పడునట్లుగా పళ్ళెమును వంచాలి. అగ్ని తీసిన పళ్ళెములోను, మూతపెట్టిన పళ్ళెములోను నీరు పోయాలి.

**సూ॥ ప్రాక్తోయమన్యం నిధదాత్యుదగ్వాయథాబహిస్స్యాచ్చ పరిస్తరాణాం**

ఒక ఉదకపాత్రను తూర్పుదిక్కున ఉంచాలి. లేదా ఉత్తరము వైపునైననూ ఉంచవచ్చును. ఇది తరువాత పెట్టబోయే పరిస్తరణలకు వెలుపల ఉండునట్లుగా పెట్టాలి.

**మం : అగ్నిమిధ్వా । భూర్భువస్సువరోం । ఇతి పాలాశగ్ంసమిధమాదధాతి ।**

క్రియ - అగ్నిని ప్రజ్వలింపజేసి నేతిలో ముంచిన సమిధను "ఓం భూర్భువస్సువరోమ్" అని అగ్నియందుంచి ఈ క్రి[illegible]ముగా అ[illegible]చాలి.

ఓం చత్వారిశృంగాత్రయో అస్యపాదాద్వే శీర్షే సప్తహస్తాసోఽస్య । త్రిధాబద్ధో వృషభోరోరవీతి మహోదేవోమర్త్యాగ్ం ఆవివేశ ॥

శ్లో॥ సప్తహస్తశ్చతుశ్శృంగ స్సప్తజిహ్వో ద్విశీర్షకః । త్రిపాత్ప్రసన్నవదన స్సుఖాసీన శ్శుచిస్మితః ॥ స్వాహాన్తు దక్షిణేపార్శ్వే దేవీంవామే స్వధాం తథా । బిభ్రద్దక్షిణ హస్తైస్తు శక్తిమన్నం స్రుచం స్రువమ్ । తోమరం వ్యజనం వామైర్ఘృత పాత్రన్తు ధారయన్ మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసమ్ । ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చిస్సర్వకామదం । ఆత్మాభిముఖమాసీన మేవం ధ్యాయేద్ధుతాశనం।

మం. ఓం ఏషహిదేవః ప్రదిశోనుసర్వాః పూర్వోహిజాతస్స ఉగర్భే అన్తః సవిజాయమాన స్సజ నిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతోముఖః ।

సూ॥ ఇతి ప్రాచ్యాం సాక్షతోదకం నినీయ ।

**క్రియ :** అగ్నికి తూర్పున అక్షతలు, ఉదకము ఉంచాలి. ఇప్పుడు హస్తములను దోసిలిగా తనవైపు త్రిప్పుతూ ఇలా చెప్పాలి.

మం. ప్రాఙ్ముఖాగ్నే - మమ అభిముఖోభవ - సుముఖోభవ ।

సుప్రసన్నోభవ / వరదోభవ । యథోక్తజిహ్వాయాహవిర్గృహాణ।

మం॥ ఓం భూర్భువస్సువః

ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ।

ధియోయోనః ప్రచోదయాత్ । (దీనిని గాయత్రీ మంత్రం అంటారు.)

**క్రియ :** పై మంత్రమును చెప్పి అగ్నికి ఈశాన్యమునుండి మొదలుపెట్టి ప్రదక్షిణంగా ఈశాన్యమున సమాప్తమగునట్లు అగ్నిచుట్టూ ఉదకము చల్లాలి.

సూ॥ సోదకేన పాణినా ప్రదక్షిణ మగ్నిం పరిసమూహ్య ॥

**క్రియ :** తరువాత తిరిగి ఈశాన్యం నుంచి ప్రదక్షిణంగా ఈశాన్యం వరకూ అలకాలి. అగ్నిమలంకృత్య

అనంతరం చేతిలో అక్షతలు తీసుకొని ఈ క్రింది మంత్రము చెపుతూ తూర్పు నుంచి ఎనిమిది దిక్కులయందు ప్రదక్షిణ క్రమంలో ఉంచాలి. గుప్పెటలో అక్షతలు తీసుకుని బొటనవేలు పైకుండేలాగ పట్టుకుని, గుప్పెటమూసి, చిటికెనవేలు మడతద్వారా వదలాలి.

మం. అగ్నయే నమః, హుతవహాయ నమః, హుతాశినే నమః, కృష్ణ వర్త్మనే నమః దేవముఖాయ నమః, సప్తజిహ్వాయ నమః, వైశ్వానరాయ నమః, జాతవేదసే నమః ।

సూ॥ ప్రాగగ్రైర్దర్భై రగ్నిం పరిస్తృణాతి । ప్రాగుదగగ్రైర్వా । దక్షిణానుత్తరాన్కరోతి। ఉత్తరానధరాన్ ॥

**క్రియ :** తూర్పున మొదలుపెట్టి నాలుగు దిక్కులందు పదహారేసి దర్భలు చొప్పున తూర్పు పడమరలలో ఉత్తరాగ్రాలుగాను ఉత్తర దక్షిణాలలో తూర్పు అగ్రాలుగాను ఉంచాలి. వీటిని పరిస్తరణలని అంటారు. దక్షిణ పరిస్తరణలను తూర్పు, పశ్చిమ పరిస్తరణల మీదగాను, ఉత్తర పరిస్తరణలను తూర్పు పశ్చిమ పరిస్తరణల క్రిందగాను ఉండునట్లు ఉంచాలి.

సూ॥ ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్ దర్భాన్ సగ్గ్ స్తీర్య ॥

**క్రియ :** ఉత్తర పరిస్తరణకు నాలుగు అంగుళముల దూరములో తూర్పు అగ్రములుగా 12 దర్భలు పరవాలి.

సూ॥ ద్వంద్వం న్యంచి పాత్రాణి ప్రయునక్తి । దేవసం యుక్తాని ॥

సూ॥ దర్వ్యాజ్యస్థాల్యౌ । ప్రోక్షణ స్రువావితి ॥

**క్రియ :** 12 ధర్భలమీద స్రుక్, ఆజ్యస్థాలీ, ప్రోక్షణపాత్ర బోర్లించి స్రువం, వాటికి తూర్పుగ బోర్లించి ఉంచాలి.

సూ॥ సమౌసాగ్రౌ ద్వౌదర్భౌప్రాదేశ మాత్రౌ పవిత్రే కురుతే

సూ॥ తృణం కాష్ఠంవాంతర్ధాయ ఛినత్తి ననఖేన ఉపస్పృశ్య

**క్రియ :** కొసలుగల, సమానమైన లావుకల రెండు దర్భలతో పవిత్రమును తయారుచేయాలి. పవిత్రాగ్రానికి బ్రహ్మ మధ్య భాగానికి విష్ణువు, మొదలు భాగానికి ఈశ్వరుడు అధిపతులు.

చేతిలో దర్భగాని, సమిధగాని పట్టుకొని దానిని ఆధారముగా తూర్పునకు కొసలు ఉండునట్లుగా చెంబు అంచున ఉంచి పవిత్రమును ప్రాదేశమాత్ర పరిమాణముగా అంటే చాపినప్పుడు చేతి బొటన, చూపుడు వేళ్ల మధ్య ఉండే దూరమంత పొడవు ఉండేటట్లు తుంచాలి. గోళ్ళతో తుంపరాదు. తర్వాత నీళ్ళతో చెయ్యి కడుగుకోవాలి.

సూ॥ మూలాదారభ్య అగ్రాదద్భిరనుమృజ్య । ప్రోక్ష్య, ప్రోక్షణ్యామవధాయ

క్రియ॥ ప్రోక్షణపాత్రను తనముందుకి తెచ్చుకుని ఎదుట ఉండేట్లు పెట్టుకోవాలి. పవిత్రం నీళ్లలో ముంచి ప్రోక్షణపాత్రలో అక్షతలు నీరు పొయ్యాలి.

సూ॥ తస్యా మక్షతైస్సహ ఆప ఆనీయ

**క్రియ :** ప్రోక్షణపాత్రలో అక్షతలు నీరు ఉంచాలి.

సూ॥ హస్తయో రంగుష్ఠోప కనిష్ఠికాభ్యా ముత్తానాభ్యా ముదగగ్రే గృహీత్వా । ప్రాచీస్త్రిరుత్పూయ ।

**క్రియ :** రెండు చేతుల బొటన, ఉంగరపు వ్రేళ్ళతో పవిత్రాన్ని కొసలు ఉత్తరానికి ఉండేలా పట్టుకొని ముడి నీటిలో మునిగేలాగ ప్రోక్షణ పాత్రలో ఉంచి పడమర నుండి తూర్పుకి విడివిడిగా మూడుసార్లు కదపాలి.

సూ॥ అభిమంత్ర్య ।

**క్రియ :** పవిత్రముతోప్రోక్షణ పాత్రని అభిమంత్రించుచూ తాకవలె.

సూ॥ స పవిత్రేణ పాణినా పాత్రాణి సమృశ్య పాత్రాణ్యుదక్ప్రవణ ముత్తానాని కృత్వా । త్రిః ప్రోక్ష్య । ప్రోక్షణీ శేషమగ్నేర్దక్షిణతో నిధాయ

**క్రియ :** పవిత్రాన్ని చేతిలో ఉంచుకొని మిగిలిన మూడు పాత్రలను (1 ఆజ్యపాత్ర, 2. స్రుక్కు 3. స్రువం) పవిత్రంతో తాకి ఉత్తర ముఖముగా త్రిప్పి ప్రోక్షణ పాత్రలోని నీటిని పవిత్రమున్న చేతిలోకి తీసుకొని మూడుసార్లు ఆ మూడు పాత్రలమీద చల్లాలి. మిగిలిన నీరు అగ్నికి దక్షిణమున ఉంచాలి.

సూ॥ ఆజ్యస్థాలీమాదాయ ఆజ్యం విలాప్య - అపరేణాగ్నిం పవిత్రాంతర్హితాయ మాజ్యస్థాల్యా ఆజ్యం నిరూప్య - ఉదీచోంగారాన్ నిరూహ్య తేష్వాజ్యమధిశ్రిత్య జ్వలతాతృణేన అధోగామిన్యా దీప్త్యా ఆజ్యే ప్రతిఫలీకృత్య ॥

**క్రియ :** ఆజ్యమును అగ్నిపై వేడి చేసి, ఆజ్యపాత్రను ఉత్తరపు వైపునుంచి పడమరకు తీసుకొని వచ్చి పరిస్తరణ బయట ఉంచి ఆజ్యపాత్రలో పవిత్రమును ఉత్తరాగ్రముగా ఉంచి ఆజ్యము పోయాలి. అగ్ని హోత్రములో ఉత్తరపువైపునుంచి కనీసం మూడు అగ్నికణములను తెచ్చి అగ్నికణములపై ఆజ్యపాత్రను ఉంచాలి. ఒక దర్భ అగ్రాన్ని మండించి ఆ మంట ఆజ్యములో కనపడునట్లు చూడాలి. తిరిగి ఆ దర్భను అగ్నిలో ఉంచాలి.

సూ॥ ద్వే దర్భాగ్రే తృణమంతర్ధాయ ప్రచ్ఛిద్య ప్రక్షాళ్య । ప్రత్యస్య ఆజ్యే ప్రాస్య। త్రిః పర్యగ్నికృత్వా ।

**క్రియ :** రెండు దర్భలు తీసుకొని అగ్రములు రెండు అంగుళముల పొడవు ఉండునట్లు పవిత్రములు త్రుంచినట్లుగా త్రుంచి, (అదివరకులాగే ఒక తృణంగాని, పుడకగాని ఆధారంగా చేసి త్రుంచాలి) ముక్కలని నీటితో కడిగి తడిలేకుండా బట్టతో అద్ది వాటిని ఆజ్యపాత్రయందు తూర్పు కొసలుగా ఉంచాలి. ఒకదర్భను అగ్నిహోత్రపు మంటలో ముట్టించి ఆ మంటను ప్రదక్షిణంగా ఆజ్యపాత్ర చుట్టూ మూడుసార్లు తిప్పి దానిని అగ్నిలో వేయాలి.

సూ॥ ఉదగుద్వాస్య । అంగారాన్ ప్రత్యూహ్య ॥

**క్రియ :** ఆజ్యపాత్రను అగ్నికి ఉత్తరముగా ఉంచి తిరిగి మూడు అగ్నికణములను అగ్నిలో ఉంచాలి.

సూ॥ ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహారమాజ్యం త్రిరుత్పూయ ।

**క్రియ :** రెండుచేతుల బొటన, చిటికెన, ఉంగరపు వ్రేళ్ళతో పవిత్రం కొసలు ఉత్తరానికి ఉండేలా పట్టుకొని ఆజ్యపాత్రలోని నేతిని తూర్పు నుండి పడమరకు తిరిగి పడమర నుంచి తూర్పుకి మూడుసార్లు [illegible]కు వెనుక[illegible]ండా) కదపాలి.

సూ॥ పవిత్రగ్రంథిం విస్రస్య ।

**క్రియ :** పవిత్రం ముడి విప్పాలి.

సూ॥ ప్రక్షాళ్య ప్రాగగ్రమగ్నౌ పవిత్రే అనుప్రహరతి ।

**క్రియ :** ఆ దర్భలని తడిపి, తడిలేకుండా తుడిచి వాటిని (అగ్నిలో) తూర్పు కొనలుండునట్లు అగ్నిహోత్రములో ఉంచాలి.

సూ॥ స్రుక్స్రువావగ్నౌ ప్రతితప్య । త్రిభిః దర్భాగ్రైఃస్సమృజ్య । పునః ప్రతితప్య। ప్రోక్ష్య । స్రువ ముత్తరతో నిధాయ । దర్భా నద్భిస్సగ్గ్ స్పృశ్య అగ్నౌ ప్రహరతి ।

**క్రియ :** హోమము చేయు స్రుక్కు, స్రువములను అగ్నిపై వేడిచేసి మూడు దర్భలతో వాటిని విడివిడిగా తుడిచి తిరిగి వాటిపై ఉదకము చల్లి అగ్నిహోత్రానికి వేడి చేసి ఉత్తరంగా స్రుక్కును, దానికి ఉత్తరంగా స్రువమును ఉంచాలి. ఆ దర్భలను తడిపి తూర్పుకొసలుగా అగ్నియందుంచాలి.

సూ॥ అగ్నిం పరిషించతి ॥

**క్రియ :** ఈ దిగువ చెప్పినట్లు చేతియందు ఉదకము ఉంచుకొని అగ్నిచుట్టూ నీరు చల్లాలి.

మం. అదితేను మన్యస్వ ॥ ఇతి దక్షిణతః ప్రాచీనం

**క్రియ :** దక్షిణ దిక్కున పడమర నుండి ఆరంభించి తూర్పువైపుగా ఉదకము చల్లాలి.

మం॥అనుమతేను మన్యస్వ । ఇతి పశ్చాదుదీచీనం ।

**క్రియ :** పడమరవైపు దక్షిణమునుంచి ఉత్తరమునకు నీళ్ళు చల్లాలి.

మం॥సరస్వతేను మన్యస్వ ॥

**క్రియ :** ఉత్తరమువైపు పడమరనుంచి తూర్పు దిక్కుకు నీరు చల్లాలి.

మం. దేవ సవితః ప్రసువ ॥ ఇతి సమన్తం ప్రదక్షిణం

**క్రియ** : ఈశాన్యం నుంచి ప్రదక్షిణంగా ఈశాన్యంవరకు చల్లాలి.

**గమనిక** : నేతిని హోమం చేసేటప్పుడు బొటన, మధ్య, ఉంగరపు వేళ్ల కొసలని దగ్గరికి చేర్చి స్రుక్కు లేదా స్రువాన్ని పట్టుకోవాలి.

స్వాహా అని వచ్చిన ప్రతిసారీ, స్వాహా అని పూర్తిగా అన్న తరవాతనే స్రుక్కులోని ఆజ్యాన్ని అగ్నికి 16 అంగుళాల ఎత్తు నుంచి హోమం చెయ్యాలి. హోమం చేసిన వెంటనే "...... ఇదం నమమ" అనాలి.

సూ॥ ఏకం । ద్వే । త్రీణి । చత్వారి । పంచ । ('పంచ' అనేది శ్రీవత్స సగోత్రులకు మాత్రమే) (అనగా పంచావత్తులకు మాత్రమే)

**క్రియ** : నేతిని కుడిచేతిలోని స్రువముతో నాలుగుసార్లుగా (శ్రీవత్సవారు 5సార్లు) ఎడమచేతిలోని స్రుక్కులోనికి గ్రహించి ఉంచి స్రుక్కును కుడిచేతిలోనికి మార్చుకోవాలి. ముందు ముందు పంచ అని వచ్చినప్పుడు శ్రీవత్స సగోత్రులు 5సార్లు నేతినిగ్రహించాలి.

మం॥ ఓం భూర్భువస్సువ స్వాహా । ప్రజాపతయ ఇదం నమమ అనాలి.

**క్రియ** : స్వాహా అన్నాక హోమం చేసి తరువాత (త్యాగం) మంత్రం చెప్పాలి.

ఏకం । ద్వే । త్రీణి । చత్వారి । (పంచ)

క్రియ : మళ్ళీ నేతిని పై విధంగానే గ్రహించాలి.

మం॥ అయాశ్చాగ్నే స్యన భిశస్తీశ్చ సత్యమిత్త్వమయాఅసి । అయసామనసాధృతో యసాహవ్యమూహిషేయానో ధేహిభేష జగ్గ్స్వాహా । అయసే ఉ గ్నయ ఇదం నమమ । ముందు చేసిన విధముగా స్వాహా అనగానే నేతిని అగ్నిలో హోమం చేసి తరువాత మంత్రం చెప్పాలి.

సూ॥ ఏతావత్పర్యన్తం నానాప్రకారేణ సంభావిత సకల దోషనిర్హరణార్థం సర్వప్రాయశ్చిత్తం కరిష్యే ।

**క్రియ :** పళ్లెములో నీరు వదలవలె. నేతిని ఒకేసారి స్రువంతో గ్రహించాలి.

సూ॥ ఓం భూర్భువస్సువస్స్వాహా । ప్రజాపతయ ఇదం నమమ.

**క్రియ :** స్వాహా అనగానే హోమం చేసి తరువాత త్యాగం చెప్పాలి. ఇప్పుడు నీరు చేతిలో తీసుకొని అగ్నికి నాలుగుదిక్కులా ఇంతకుముందువలె చల్లాలి.

మం. అదితేన్వమగ్గ్‌స్థాః / నీరు దక్షిణాన (పడమర నుండి తూర్పుకి)

అనుమతేన్వమగ్గ్‌స్థాః / పశ్చిమాన (దక్షిణం నుండి ఉత్తరానికి)

సరస్వతేన్వమగ్గ్‌స్థాః / ఉత్తరాన (పశ్చిమం నుంచి తూర్పుకి)

దేవసవితః ప్రాసావీః । ఈశాన్యం నుండి ఈశాన్యం వరకు చల్లాలి.

సూ॥ అనేన విచ్ఛిన్నౌపాసన హోమేన భగవాన్ సర్వాత్మకః సర్వం శ్రీ యజ్ఞేశ్వర హుతాశనః సుప్రీణాతు. శ్రీయజ్ఞేశ్వరార్పణమస్తు.

**క్రియ :** అక్షతలు, నీరు పళ్లెములో వదలాలి. నమస్కరిస్తూ కింది శ్లోకాలు చదవాలి.

శ్లో॥ స్వస్తి శ్రద్ధాంమేధాంయశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమాయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హవ్యవాహన । శ్రియందేహిమే హవ్యవాహన ఓం నమ ఇతి। యస్య స్మృత్యాచనామోక్త్యా తపోహోమక్రియాదిషు । న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమ చ్యుతమ్ । మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన। యద్ధుతంతుమయాదేవ పరిపూర్ణం తదస్తుతే।

**క్రియ :** ముందు ఎడమచేతితో కుడిచెవిని తరవాత కుడిచేతితో ఎడమచెవిని పట్టుకొని ఈ కింది ప్రవర చెప్పాలి.

చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు ..... ప్రవరాన్విత ... గోత్రః .... సూత్రః .... శాఖాధ్యాయీ .... **శర్మా అహంభో అభివాదయే** (యజమాని ప్రవర చెప్పుకోవాలి)

**సప్తహోతృహోమము :**

**క్రియ :** ఆచమనం చేసి అనంతరం ప్రాణాయామం చెయ్యాలి. (ఓం భూః .... భూర్భువస్సువరోమ్)

సూ॥ అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం అనేక ఔపాసనాంతరిత లోప ప్రాయశ్చిత్తార్థం, సప్తహోతారం హోష్యామి ।

**క్రియ :** పళ్ళెంలో నీళ్ళు వదలాలి. నీరు చేతిలో తీసుకొని అదివరకు లాగే అగ్నికి నాలుగు దిక్కులా చల్లాలి.

సూ॥ అదితేనుమన్యస్వ । అనుమతేనుమన్యస్వ । సరస్వతేనుమన్యస్వ । దేవసవితః ప్రసువ । ఏకం । ద్వే । త్రీణి । చత్వారి । (పంచ)

**క్రియ :** నేతిని కుడిచేతిలోని స్రువముతో స్రుక్కులోనికి గ్రహించి నాలుగుసార్లుగా ఎడమచేతిలోని స్రుక్కులో ఉంచి, స్రుక్‌ను కుడిచేతిలోనికి మార్చుకోవాలి.

మం. మహోహ విర్హోతా । సత్యహవిరధ్వర్యుః । అచ్యుత పాజా అగ్నీత్ । అచ్యుత మనా ఉపవక్తా । అనాధృష్యశ్చా ప్రతిధృష్యశ్చయజ్ఞ స్యాభిగరౌ । అయాస్యఉద్గాతా। వాచస్పతేహృద్విధేనామన్ । విధేమతేనామ । విధేస్త్వమస్మాకంనామ । వాచస్పతిస్సోమమపాత్ । మాదైవ్య స్తంతుశ్చేదిమా మనుష్యః । నమోదివే । నమః పృథివ్యై స్వాహా ।

త్యాగం : వాచస్పతయే బ్రహ్మణ ఇదం న...

**క్రియ :** స్వాహా అన్నాక హోమం చేసి తరువాత మంత్రం చెప్పాలి.

సూ॥ ఏతావత్పర్యన్తం నానాప్రకారేణ సంభావిత సకల దోష నిర్హణార్థం సర్వ ప్రాయశ్చిత్తం కరిష్యే ।

**క్రియ :** పళ్లెంలో నీళ్లు వదలవలె. నేతిని స్రువంతో ఒకేసారి గ్రహించాలి.

మం॥ ఓం భూర్భువస్సువస్స్వాహా । ప్రజాపతయ ఇదంనమమ ।

**క్రియ :** స్వాహా అన్నాక హోమం చేసి తరువాత మంత్రం చెప్పాలి.

సూ॥ అదితేన్వమగ్గ్‌స్థాః । అనుమతేన్వమగ్గ్‌స్థాః । సరస్వతేన్వమగ్గ్‌స్థాః । దేవసవితః ప్రాసావీః ।

**క్రియ :** ఇంతకుముందు చేసినట్లే అగ్నిచుట్టూ నీళ్లు చల్లాలి.

సూ॥ అనేన సప్తహోతృహోమేన భగవాన్ సర్వాత్మకః శ్రీ యజ్ఞేశ్వరహుతాశనః సుప్రీణాతు । ఏతత్ఫలం శ్రీ యజ్ఞేశ్వరార్పణమస్తు ।

**క్రియ :** అక్షతలు నీటితో పళ్లెములో వదలవలె.

**క్రియ :** అక్షతలు, నీరు పళ్లెములో వదలాలి. నమస్కరిస్తూ కింది శ్లోకాలు చదవాలి.

శ్లో॥ స్వస్తి శ్రద్ధాంమేధాంయశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమాయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హవ్యవాహన । శ్రియందేహిమే హవ్యవాహన ఓం నమ ఇతి। యస్య స్మృత్యా చనామోక్త్యా తపోహోమక్రియాదిషు । న్యూనం సంపూర్ణతాం యాతే సద్యోవందే తమచ్యుతమ్ । మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన। యద్ధుతంతుమయాదేవ పరిపూర్ణం తదస్తుతే ।

క్రియ : ముందు ఎడమచేతితో కుడిచెవిని తరవాత కుడిచేతితో ఎడమచెవిని పట్టుకొని ఈ కింది ప్రవర చెప్పాలి.

చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు ..... ప్రవరాన్విత ... గోత్రః .... సూత్రః .... శాఖాధ్యాయీ .... శర్మా అహంభో అభివాదయే (యజమాని ప్రవర చెప్పుకోవాలి)

## ప్రాతరౌపాసనము (తండులహోమము)

**ఆచమ్య :** పురాణాచమనం చెయ్యాలి. (ఓం కేశవాయ స్వాహా .... శ్రీకృష్ణాయ నమః)

**ప్రాణానాయమ్య :** ప్రాణాయామం మంత్రముతో చెయ్యాలి. (ఓం భూః ..... భూర్భువస్సువరోం)

**సంకల్పం :** మొదట్లోవలె సంకల్పం చెప్పుకోవాలి. చివర్లో ... గోత్రస్య ... నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య మమోపాత్త .... ప్రీత్యర్థం ప్రాతరౌపాసనం తండులైర్హోష్యామి అని నీళ్లు పళ్లెంలో వదలాలి.

మం॥ అగ్నిమిధ్వా । ఓం భూర్భువస్సువరోం ।

**క్రియ :** నేతిలో ముంచిన మోదుగ సమిధను అగ్నిలో ఉంచి జ్వాలవచ్చునట్లు అగ్నిని ప్రజ్వలింపచేయాలి. కింది మంత్రం చెపుతూ అగ్నికి నమస్కరించవలె.

మం. ఓం చత్వారిశృంగాత్రయో అస్య పాదాద్వేశీర్షే సప్తహస్తాసోఅస్య । త్రిధాబద్ధో

వృషభోరోరవీతి మహోదేవోమర్త్యాగ్ం ఆవివేశ ॥

సప్తహస్తశ్చతుశ్శృంగ స్సప్తజిహ్వో ద్విశీర్షకః । త్రిపాత్ప్రసన్నవదన స్సుఖాసీన శ్శుచిస్మితః ॥ స్వాహాన్తు దక్షిణేపార్శ్వే దేవీంవామే స్వధాం తథా । బిభ్రద్దక్షిణ హస్తైస్తు శక్తిమన్నం స్రుచం స్రువమ్ । తోమరం వ్యజనం వామైర్ఘృతపాత్రన్తు ధారయన్ । మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసమ్ ॥ ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చి స్సర్వకామదం । ఆత్మాభిముఖమాసీన మేవం ధ్యాయే ద్ధుతాశనం ॥

మం. ఓం ఏషహిదేవః ప్రదిశోనుసర్వాః పూర్వోహిజాతస్స ఉగర్భే అన్తః ।

సవిజాయమానస్సజనిష్యమాణః ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతోముఖః ।

ఇతి ప్రాచ్యాం సాక్షతో దకం నినీయ ।

**క్రియ :** అగ్నికి తూర్పున అక్షతలు, ఉదకము ఉంచవలె. హస్తములను దోసిలిగా తనవైపు త్రిప్పుతూ ఇలా చెప్పవలె.

సూ॥ ప్రాఙ్ముఖాగ్నే । మమ అభిముఖోభవ । సుముఖోభవ । సుప్రసన్నోభవ । వరదోభవ । యథోక్తజిహ్వయా హవిర్గృహాణ ॥

మం. ఓం భూర్భువస్సువః । ఓం తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ ।

సూ॥ సోదకేనపాణినా ప్రదక్షిణమగ్నిం పరిసమూహ్య

**క్రియ :** అగ్నిచుట్టూ ప్రదక్షిణముగా నీటితో చతురస్రంగా అదివరకటి లాగానే అలకాలి.

సూ॥ అగ్నిమలంకృత్య । అక్షతలు గుప్పిటతో తీసుకొని తూర్పున మొదలుపెట్టి ఈశాన్యము వరకు ఎనిమిది దిక్కుల ఇలా చెపుతూ విచ్ఛిన్నౌపాసనలో ఉంచినట్లే ఉంచాలి.

మం. అగ్నయే నమః । హుతవహాయ నమః । హుతాశినే నమః । కృష్ణవర్త్మనే నమః దేవముఖాయ నమః । సప్తజిహ్వాయ నమః । వైశ్వానరాయ నమః । జాతవేదసే నమః ॥ అగ్నిం పరిషించతి ।

క్రియ : నీరు చేతిలో తీసుకొని అగ్నికి నాలుగుదిక్కులా ఇదివరకటిలాగే చల్లాలి.

మం. అదితేనుమన్యస్వ । అనుమతేనుమన్యస్వ । సరస్వతేనుమన్యస్వ । దేవసవితః ప్రసువ । తండులానాదాయ । ద్వేధావిభజ్య ।

**క్రియ :** బియ్యము కుడిచేతిలోకి తీసికొని సగంకంటే ఎక్కువగా ఎడమచేతిలోకి మార్చుకొని ఓం సూర్యాయ స్వాహా । అని కుడిచేతిలోని బియ్యాన్ని వేళ్ల కణుపుల మీదుగా అగ్నిలో మధ్యగా హోమం చేసి 'సూర్యాయేదం నమమ' అనాలి.

తరువాత ఎడమచేతిలోని బియ్యము కుడిచేతిలోకి గ్రహించి గుప్పెటగా ఉంచి బొటనవేలుపై కుండేలాగ పట్టుకుని అని, అగ్నిలో ఈశాన్యభాగంలో పూర్వంవలె

హోమంచేసి అగ్నయే స్విష్టకృతేస్వాహా । అని అగ్నిలో ఈశాన్యంవైపున హోమంచేసి "అగ్నయే స్విష్టకృత ఇదం నమమ" అనాలి.

సూ॥ ఆహుతిసంసర్గదోష నిర్హరణార్థం వనస్పతిహోమం కరిష్యే ।

క్రియ॥ పళ్లెములో నీళ్లు వదలాలి.

మం. యత్రవేత్థవనస్పతేదేవానాం గుహ్యానామాని । తత్రహవ్యాని గామయ । అని

క్రియ : ఒక మోదుగ సమిధను నేతిలో ముంచి అగ్నిలో ఉంచి వనస్పతయ ఇదం నమమ । అనాలి.

మం. అదితేన్వమగ్‌స్థాః । అనుమతేన్వమగ్‌స్థాః । సరస్వతేన్వమగ్‌స్థాః । దేవసవితః ప్రాసావీః ।

**క్రియ :** అగ్నికి నాలుగు దిక్కులా అదివరకులాగే చల్లాలి.

## ఉపస్థానము

**క్రియ :** అగ్నికి ఎదురుగా నిలబడి నమస్కరిస్తూ కింది మంత్రం (ఉపస్థానం) చెప్పాలి.

మం. ఓం అగ్నేత్వన్నో అంతమః । ఉతత్రాతాశివో భవవరూథ్యః । తంత్వాశోచిష్ఠ దీదివః । సుమ్నాయనూనమీమహేసఖిభ్యః । వసురగ్నిర్వసుశ్రవాః । అచ్ఛానక్షి-ద్యుమత్తమోరయిందాః । సనోబోధి శ్రుధీహవ మురుష్యాణో అఘాయత-స్సమస్మాత్‌. హోమసాద్గుణ్యార్థం అనాజ్ఞాత త్రయ మంత్రజపం కరిష్యే ।

**క్రియ :** పళ్లెములో నీళ్లు వదలాలి.

మం. ఓం అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు । అగ్నేతదస్య కల్పయత్వగ్ం హివేత్థ యథాతథమ్ । పురుష సమ్మితో యజ్ఞో యజ్ఞః

పురుషసమ్మితః అగ్నేతదస్య కల్పయ త్వగ్ంహి వేత్థయథాతథమ్ ।
యత్పాకత్రామనసా దీనదక్షానయజ్ఞస్య మన్వతే మర్తాసః । అగ్నిష్టద్ధోతా
క్రతువిద్విజానన్ యజిష్ఠోదేవాగ్ం ఋతుశోయజాతి । అనేన ప్రాతరౌపాసన
హోమేన భగవాన్ సర్వాత్మకః శ్రీ యజ్ఞేశ్వర హుతాశనః స్సుప్రీణాతు । ఏ
తత్ఫలం శ్రీయజ్ఞేశ్వరార్పణమస్తు ।

**క్రియ :** అక్షతలు, నీరు పళ్లెములో వదలాలి. నమస్కరిస్తూ కింది శ్లోకాలు చదవాలి.

శ్లో॥ స్వస్తి శ్రద్ధాంమేధాంయశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమాయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హవ్యవాహన । శ్రియందేహిమే హవ్యవాహన ఓం నమ ఇతి। యస్య స్మృత్యా చనామోక్త్యా తపోహోమ క్రియాదిషు । న్యూనం సంపూర్ణతాం యాతే సద్యోవందే తమ చ్యుతమ్ । మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన। యద్ధుతంతుమయాదేవ పరిపూర్ణం తదస్తుతే।

**క్రియ :** ముందు ఎడమచేతితో కుడిచెవిని తరవాత కుడిచేతితో ఎడమచెవిని పట్టుకొని ఈ కింది ప్రవర చెప్పాలి.

చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు ..... ప్రవరాన్విత ... గోత్రః .... సూత్రః .... శాఖాధ్యాయీ .... శర్మా అహంభో అభివాదయే (యజమాని ప్రవర చెప్పుకోవాలి)

**ఆచమ్య :** పురాణాచమనం చెయ్యాలి. అనంతరం గ్లాసులోని నీళ్లు, హరివాణంలో నీళ్లు పారబోయాలి. దీనితో విచ్ఛిన్నౌపాసనము, ప్రాతరౌపాసనము సమాప్తం.

## మూడవ ప్రకరణము

# ఆబ్దిక శ్రాద్ధ ప్రక్రియ

**ఉపోద్ఘాతము :** విచ్చిన్నౌపాసన పాత్రరౌపాసనముల అనంతరం కర్త స్నానం చేసి తెల్లమడి పంచె (ఎర్రంచుకానిది) బిళ్ళగోచీతో ధరించి, తెల్లకండువా లేక అంగవస్త్రం నడుముకు కట్టుకోవాలి. శ్రాద్ధం ప్రారంభించే ముందు కర్తగాని, అతని భార్యగాని దీపారాధన చెయ్యాలి. ఈ దీపం శ్రాద్ధం పూర్తి అయ్యేవరకు ఆరకూడదు. ఆరితే ఆ రోజు ఉపవసించి మరునాడు శ్రాద్ధం పెట్టాలి. విభూతి ధరించకుండా నేలమీద తూర్పుముఖంగా కూర్చుని ఆబ్దికం ప్రారంభించాలి. ఇత్తడి, రాగి లేదా కంచు చెంబుతో నీళ్ళు, ఉద్ధరణి, హరివాణము (పళ్లె) దగ్గరుండాలి. సోదరులుండేవారు కూడా చెంబుతో నీళ్ళు, ఉద్ధరణి దగ్గరుంచుకోవాలి. స్టీలు పాత్రలు పనికిరావు. విశ్వేదేవస్థానభోక్త తూర్పుముఖంగాను, పితృస్థానభోక్త ఉత్తరముఖంగాను వారికి వేసిన ఆసనాలమీద కూర్చోవాలి. భోక్తలు స్నానంచేసి ఆరిన తెల్లమడిపంచెలు ధరించి అంగవస్త్రాలు బుజాలపై వేసుకోవాలి. విభూతి ధరించకూడదు.

**గమనిక :** కొందరు కర్త స్నానం చెయ్యకుండా విభూతి చెరుపుకుంటే చాలు అంటున్నారు. అది సరి అయిన పద్ధతికాదు. కనీసం కాళ్ళు, ముఖం కడుక్కుని నెత్తిమీద 'అపవిత్రః పవిత్రోవా" ... అనే మంత్రంతో నీళ్లు చల్లుకోవాలి. ఇది రెండవ పక్షం. అగ్నిసిద్ధం చేసుకున్న గదిలోనే ఆబ్దికాదులు పెట్టాలి.

**పవిత్రధారణ :** ఆచమ్య (పురాణాచమనం) ఓం కేశవాయ స్వాహా .... శ్రీకృష్ణాయ నమః

**గమనిక :** సమిష్టిగా సోదరులు ఆబ్దికం పెడుతుంటే ఇటుపైన కర్తతోపాటు వారంతా ఆచమనం చెయ్యాలి. ఆచమ్య అని వచ్చిన ప్రతిసారీ ఆవిధముగానే సోదరులందరూ చేయాలి.

మం. పవిత్ర వంతః పరివాజమాసతే । పితైషాంప్రత్నో అభిరక్షతి వ్రతం ।
మహస్సముద్రం వరుణస్తిరోదధే । ధీరా ఇచ్ఛేక్రుర్ధరుణేష్వారభం । పవిత్రం-
తేవితతం బ్రహ్మణస్పతే । ప్రభుర్గాత్రాణి పర్యేషివిశ్వతః । అతప్తతనూర్న తదామో
అశ్నుతే । శ్రుతాస ఇద్వహంతస్తత్సమాసత ।

**సూ॥** పవిత్రంధృత్వా ।

పవిత్రం ధరించాలి. (సోదరులందరూ ధరించాలి.) ప్రధానకర్త పవిత్రం తీసి నప్పుడు, తిరిగి ధరించినప్పుడు మార్చుకున్నప్పుడు సోదరులంతా అనుసరించాలి.)

**గమనిక :** శ్రాద్ధంలో 6 సార్లు "పునః పవిత్రంధృత్వా" అని వచ్చినపుడు పవిత్రం విసర్జించి కొత్త పవిత్రం ధరించి పాతపవిత్రం ముడివిప్పి వదిలెయ్యాలి. కొందరు మొదట్లోనే రెండు పవిత్రాలు జమిలిగా ధరించి మధ్యలో మార్చకుండా వాటినే చివరివరకూ వాడుతున్నారు. ఇది శాస్త్రసమ్మతము కాదు.

**ఆచమ్య :** పురాణాచమనం చెయ్యాలి. ఇక్కడ కొందరు శ్రుత్యాచమనం కింది విధంగా చేస్తున్నారు.

**శ్రుత్యాచమనము :**

1. త్రిరాచామేత్ మినుపగింజ మునుగునంత జలమును బ్రహ్మతీర్థముతో మూడుసార్లు ఆచమించాలి.

2. ద్విః పరిమృజ్య । సకృదుపస్పృశ్య । ఎడమ అరచేతిలో నీళ్లు పోసుకొని బొటనవ్రేలిని ఆ నీటిలో ముంచి పెదవుల రెంటిని బొటనవేలితో రెండుమార్లు తాకి, మరల నొకసారి పెదవులను తాకవలెను.

3. యత్ సవ్యం పాణిం పాదౌ ప్రోక్షతి – ఎడమచేతిలో నీటిని కుడిచేతి వ్రేళ్లతో ఎడమచేతి మీద, చల్లుకొని, మిగిలిన నీళ్లు కుడిచేతిలో పోసుకుని, ఎడమచేతితో కుడిచేతి మీద చల్లుకుని, కుడిచేతిలో నీళ్లని రెండు పాదములపై నీరు చల్లుకోవాలి.

4. శిరశ్చక్షుషీ, నాసికే శ్రోత్రే హృదయమాలభ్య - కుడిచేతి వ్రేళ్ళ చివరలతో తలను బొటన ఉంగరపు వ్రేళ్ళతో కండ్లను, బొటనవేలు - చూపుడువేళ్ళతో ముక్కుపుటలను, బొటన ఉంగరపు వ్రేళ్ళతో చెవులను, అరచేతితో హృదయమును తాకాలి. అనంతరం చెయ్యి కడుగుకోవాలి.

**భూతోచ్చాటన :**

సూ॥ ఉత్తిష్ఠంతు .... సమారభే

క్రియ : వెనుకకు నీళ్లు చల్లాలి.

**ప్రాణాయామము :** "ఓం భూః ... ప్రచోదయాత్ ।

ఓమాపో జ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్ ।, అని మూడుసార్లు ప్రాణాయామం చెయ్యాలి. శ్రీ గోవింద గోవింద గోవింద అని అరచెయ్యి ముక్కు కొనమీద ఆనించాలి.

శ్లో॥ తిథిర్విష్ణుస్తథావారో నక్షత్రం విష్ణురేవ చ ।
యోగశ్చకరణం చైవ సర్వం విష్ణుమయం జగత్ ॥

**సంకల్పం :** శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య - అద్యబ్రహ్మణః ..... .... అస్మిన్ వర్తమానవ్యావహారిక చాంద్రమానేన .... సంవత్సరే (శ్రాద్ధతిథి ననుసరించి) అయనే .... ఋతౌ .... మాసే .... పక్షే .... వాసరసంయుక్తాయాం శ్రీవిష్ణునక్షత్రే, శ్రీవిష్ణుయోగే, శ్రీవిష్ణుకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ ప్రాచీనావీతీ

**క్రియ :** జంధ్యం కుడిభుజం మీదికి మార్చుకోవాలి ముందు ముందు ప్రాచీనావీతి అని వచ్చిన ప్రతిసారీ ఇట్లాగే చెయ్యాలి సమష్టిగా ఆబ్దికం జరుపుతుంటే సోదరులంతా కర్తతోపాటు జంధ్యాలు కుడిభుజం మీదికి మార్చుకోవాలి. తిరిగి కర్తతోపాటే సవ్యం చేసుకోవాలి. కర్త అస్మత్' అనుకోవాలి (కర్త బదులు వేరే వ్యక్తి శ్రాద్ధం పెడుతుంటే 'యజమానస్య' అనాలి.

సూ॥ పితుః (తండ్రి అయితే - తల్లి అయితే మాతుః అనాలి. ఇతరులకు తాను కర్త అయితే ఆ బంధుత్వం చెప్పాలి) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే

పితృపితామహప్రపితామహానాం (మాతృపితామహీ ప్రపితామహీనాం) ... గోత్రాణాం ... శర్మణాం (దాయీనాం) వసురుద్రాదిత్యరూపాణాం –ఉపవీతీ (సవ్యం చేసుకోవాలి. పురూరవార్ద్రవసంజ్ఞకానాం విశ్వేషాం దేవానాంచ అన్నేనహవిషాపార్వణవిధానేన (ప్రాచీనావీతీ) యజమానస్య (కర్త 'అస్మత్ అనాలి) పితుః (మాతుః) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం యుష్మదనుజ్ఞయా సదైవం అద్య కరిష్యే ।

భోక్తలుగా వచ్చిన బ్రాహ్మణులు - కురుష్వ అనాలి.

**గమనికలు :** 1) తండ్రి, తాత, ముత్తాతలలో ఎవరైనా యజ్ఞం చేసినవారుంటే వారి పేరులో ఈశ్వర తరువాత యజ్వశర్మాణం వారి భార్య విషయంలో పేరు చివర సోమపీథిని దాయీం అని చెప్పాలి. 2) వీరిలో సన్యసించిన వారెవరైనా ఉంటే 'బ్రహ్మీభూత అని చెప్పి వారి పూర్వాశ్రమ (సన్యసించక ముందు) నామం చెప్పాలి. 3) వీరిలో ఎవరిపేరైనా తెలియకపోతే యజ్ఞేశ్వర (యజ్ఞప) అని చెప్పాలి. 4) ఇతరులకెవరికైనా శ్రాద్ధం పెట్టేటప్పుడు గోత్రం తెలియకపోతే కాశ్యపసగోత్రం అని చెప్పాలి. పేరు తెలియకపోతే బంధుత్వం చెబుతే చాలు (ధర్మసింధు, శ్రాద్ధ మంజరి) 5) మాసికం అయితే ఎన్నవ మాసపు మాసికమో చెప్పాలి. ఊనాలయితే ఏ ఊనమో చెప్పాలి. అట్లాగే త్రైపక్షి కానికి, సంవత్సర విమోకానికి చెప్పాలి. అంతేకాక సంవత్సరవిమోకం తరవాత జరిపే మొదటి ఆబ్దికానికి ప్రథమసాంవత్సరీక మృతాహాఖ్యాన్నశ్రాద్ధే అని చెప్పాలి.

సూ॥ కాలే అధికార సిద్ధ్యర్థం యధాశక్తి సంభవత్పరిషత్ప్రాయశ్చిత్తం కరిష్యే

**క్రియ :** సవ్యం చేసుకొని, అనగా జంధ్యాన్ని తిరిగి ఎడమభుజం మీదకి మార్చుకుని నీళ్లు వదలాలి. ఇప్పుడు బ్రాహ్మణులు "కురుష్వ" అనాలి.

సూ॥ తిలదర్భ హిరణ్యాక్షతాన్ గృహీత్వా ఆత్మ ప్రదక్షిణ త్రయం కృత్వా

**క్రియ :** దర్భలు, తిలలు, అక్షతలు, రూపాయి నాణెం గ్రహించి మూడుసార్లు ఆత్మప్రదక్షిణం చెయ్యాలి.

శ్లో॥ సమస్త సంపత్సమవాప్తిహేతవస్సముత్థితాపత్కుల ధూమకేతవః ।
అపార సంసార సముద్రసేతవః పునంతుమాం బ్రాహ్మణ పాదపాం సవః ।

ఆపద్ఘనధ్వాంత సహస్రభానవస్సమీహితార్థార్పణ కామధేనవః ।
సమస్తతీర్థాంబు పవిత్ర మూర్తయోరక్షంతు మాం బ్రాహ్మణ పాద పాంసవః

ఆధివ్యాధిహరంన్నృణాం మృత్యుదారిద్ర్యనాశనం ।
శ్రీ పుష్టికీర్తిదంవందే విప్రశ్రీ పాదపంకజం ।

విప్రౌఘదర్శనాత్సద్యః క్షీయంతే పాపరాశయః ।
వందనాన్మంగళావాప్తిరర్చనాదచ్యుతం పదం ।

నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయచ ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః

మం. యావతీర్వై దేవతాస్తా స్సర్వా వేదవిదిబ్రాహ్మణే వసంతి। తస్మాద్బ్రాహ్మణేభ్యోవేద విద్భ్యో దివే దివే నమస్కుర్యాన్నా శ్లీ లంకీర్తయే దేతా ఏవ దేవతాః ప్రీణాతి ।

పళ్లెంలో దర్భలు వగైరా నీటితో వదిలి భోక్తలకు నమస్కరించాలి.

(ప్రాచీనావీతి) యజమానస్య (అస్మత్) పితుః (మాతుః) ప్రాతిసాంవత్సరీక మృతాహోఖ్యాన్న శ్రాద్ధం కర్తుం ముఖ్యకాలో భూత్వా ।

(కర్త) కర్తుం అధికార సంపదస్త్వితి భవంతో బ్రువంతు ।

అంటూ నువ్వులు పెడమరలుగా కుడిచేతితో తీసుకుని చూపుడు బొటనవేళ్లమధ్య నుంచి కిందికి పళ్లెములో వదలాలి.

(బ్రాహ్మణులు) కర్తుం అధికార సంపదస్తు అని అనాలి.

(సవ్యం) (కర్త) కాలశ్చ ।

(బ్రాహ్మణులు) ముఖ్యకాలోస్తు

(కర్త) పాకాదీనాం (బ్రాహ్మణులు) పవిత్రతాస్తు

(కర్త) సర్వేపాకాః (బ్రాహ్మణులు) శుచయో భవంతు

శ్లో॥ దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవ చ ।
నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమో...

ఈశానః పితృః రూపేణ మహాదేవో మహేశ్వరః ప్రియతాం భగవానీశః పరమాత్మా సదాశివః

**క్రియ :** ముక్కుకొసపై అరచేతిని ఆనించాలి.

ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేసణ విశిష్టాయాం పుణ్యతిథౌ ప్రాచీనావీతి॥ అస్మత్ (యజమానస్య) పితుః (మాతుః) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్నశ్రాద్ధే

అస్మత్ (యజమానస్య) పితృ పితామహ ప్రపితామహానాం (మాతృపితామహీ ప్రపితామహీనాం) గోత్రాణాం ... శర్మాణాం (దాయినాం)

వసురుద్రాదిత్య రూపాణాం

సవ్యం ॥ పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం చ

ప్రాచీనావీతి॥ పితుః (మాతుః) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్నశ్రాద్ధం భవిష్యతీతితత్ర భవిష్యతి

**క్రియ :** ఒక దర్భను గ్లాసు సహాయముతో రెండు ముక్కలు చేసి గ్లాసులో పడవెయ్యాలి.

**క్రియ :** కర్త ఎడమచేతితో కూర్చను తీసుకుని కుడిచేతిని తాకించి కుడిచేతిలోకి మార్చుకుని (సోదరులుంటే వారి కుడి అరచేతులకు తాకించి) తిరిగి నీటిలో ముంచి తూర్పుముఖముగా కూర్చున్న విశ్వదేవస్థానములోని భోక్త కుడి అరచేతికి తాకించాలి.

సూ॥ అక్షత కుశానాదాయ। పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం స్థానే ఆహవనీయార్థే క్షణంద్కృత్వా భవద్భిః । క్షణః ప్రసాదః కరణీయః (అని కర్త అనాలి)

(భోక్త) అస్తుకరణీయః అని అనాలి.

**క్రియ :** భోక్త శిరస్సున అక్షతలు చల్లి దర్భ చేతికి ఇవ్వాలి.

ఈ దర్భను భోక్త భోజన సమయంలో ప్రాణాహుతులు తీసుకునేదాకా ఉంగరపు వేలికి ధరించాలి. భోజనానంతరం తిరిగి ధరించాలి.

సూ॥ (ప్రాచీనావీతి) సతిలకుశానాదాయ । పిత్ృ స్థానే హస్తోదకందత్వా ।
(పూర్వంలాగానే) కర్త హస్తోదకం తను తీసుకొని సోదరులకిచ్చి ఉత్తరముఖముగా పితృ (మాతృ) స్థానములో కూర్చున్న భోక్తకివ్వాలి.

సూ॥ యజమానస్య (కర్త 'అస్మత్' అనాలి)

పితృ పితామహ ప్రపితామహానామ్ ... గోత్రాణామ్ (తండ్రి, తాత, ముత్తాతల పేర్లకు ఈశ్వర శబ్దం చేర్చి చెప్పాలి) .... శర్మణామ్ లేదా

మాతృ పితామహీ ప్రపితామహీనామ్ ... గోత్రాణామ్ (తల్లి, నాయనమ్మ, ముత్తవతల్లి పేర్లకు చివర 'ప' చేర్చి చెప్పాలి) దాయీనామ్ స్థానే ఆహవనీయార్థే క్షణంధృత్వా భవద్భిః । క్షణః ప్రసాదః (కర్త) కరణీయః (భోక్త) అస్తు కరణీయః అని చెప్పాలి. భోక్త శిరస్సున తిలలు చల్లి దర్భ చేతికి ఇవ్వాలి. (సవ్యం) ఈ దర్భను భోక్త ఉంగరపువేలికి విశ్వేదేవస్థాన భోక్తవలెనే ధరించాలి.

శ్లో॥ అక్రోధనై శ్శౌచపరై స్సతతం బ్రహ్మవాదిభిః ।
భవితవ్యం భవద్భిశ్చమయా చ శ్రాద్ధకర్మణి

క్రియ : భోక్తలకు నమస్కరించాలి.

**పాద్యము (భోక్తల పాదప్రక్షాళనము) :**

కర్త వేరే గ్లాసులో మడినీళ్లు తీసుకుని, ఆ గ్లాసు, ఉద్ధరణి, అక్షతలు, తిలలు, గంధం, దర్భలు, నెయ్యి బయటకు తీసుకెళ్లాలి. సోదరులుంటే వారు వారి చెంబులతో అనుసరించాలి. భోక్తలు వారి గ్లాసులతో అనుసరించాలి. ఇంటి ఆవరణలో బయలు ప్రదేశంగాని, అటువంటిది లేకపోతే ఇంటిగుమ్మం ముందుగాని ఈ కార్యక్రమం జరపాలి.

సూ॥గృహాంగణే గోమయేన మండలద్వయం సవ్యేన ఉత్తరే చతురశ్రమండలం। దక్షిణే ప్రాచీనావీతినావర్తులాకార మండలం కృత్వా

శ్లో॥ దక్షిణేవర్తులాకారం ఉత్తరే చతురశ్రమౌ

**క్రియ :** మొదట 6 అంగుళాల చతురస్ర ఆకారంలో ఆవుపేడ గాని లేక పసుపుతోగాని ప్రదక్షిణ క్రమంలో (గడియారం ము[illegible]లె చెయ్యి తి[illegible]లకాలి.

దీనిని దేవమండలం అంటారు. తరువాత దీనికి దక్షిణంగా 6 అంగుళాల దూరం వదిలి, ప్రాచీనావీతి చేసుకుని 6 అంగుళాల పరిమాణంలో గుండ్రంగా అప్రదక్షిణంగా (పై దానికి వ్యతిరేకంగా) అలకాలి. దీనిని పితృమండలం అంటారు. అనగా ఉత్తరంవైపు దేవమండలం దక్షిణంవైపు పితృమండలం ఉండాలి. దేవమండలం పరిమాణం ప్రాదేశమాత్రం అని, పితృమండలం పరిమాణం వితస్తి (జానెడు) అని ధర్మప్రవృత్తిలో ఉన్నది. అలికిన తరువాత చెయ్యి కడుగుకొని సవ్యం చేసుకోవాలి.

సూ॥ పురూరవార్ద్రవ సంజ్ఞికానాం విశ్వేషాం దేవానాంపాద్యస్థానే ఇదమిద మాసనం ।

**క్రియ :** చతురస్ర మండలము మీద దర్భ ఉంచాలి.

సూ॥ పాద్యస్థానే అర్చతప్రార్చత - మళ్లీ దర్భ ఉంచాలి.

సూ॥ పాద్యస్థానే దైవేక్షణ క్రియతాం - అక్షతలు చల్లాలి.

సూ॥ అయం గంధః

**క్రియ :** గంధం ఉంచాలి.

సూ॥ పుష్పార్థా ఇమే అక్షతాః । అక్షతలు ఉంచాలి.

అయం కుశః । దర్భలు ఉంచాలి.

సూ॥ ఉదకేనైవ సకలారాధనై స్స్వర్చితమస్తు ।

**క్రియ :** దర్భ, అక్షతలు, ఉదకం పళ్లెములో వదలాలి.

సూ॥ (ప్రాచీనావీతీ) యజమానస్య (అస్మత్) పితృ పితామహ ప్రపితా మహానాం ... గోత్రాణాం ... శర్మణాం .... (మాతృ పితామహీ ప్రపితామహీనాం గోత్రాణాం ... దాయీనాం) వసురుద్రాదిత్య రూపాణాంపాద్యస్థానే ఇదమిద మాసనం ।

**క్రియ :** వృత్తాకార మండలము మీద పెడమరలుగా దర్భ ఉంచాలి.

సూ॥ పాద్యస్థానే అర్చతప్రార్చత పెడమరలుగా తిలలు ఉంచాలి.

సూ॥ (సవ్యం) అయం గంధః । గంధము ఉంచవలె.

సూ॥ (ప్రాచీనావీతి) పుష్పార్థా ఇమే తిలాః ।

**క్రియ :** పెడమరలుగా తిలలు ఉంచాలి.

సూ॥ అమీ కుశాః ।

**క్రియ :** పెడమరలుగా దర్భలు ఉంచాలి.

సూ॥ సకలారాధనై స్స్వర్చితమస్తు ।

**క్రియ :** దర్భ, తిలలు, ఉదకము పెడమరలుగా పళ్లెములో వదలాలి.

సూ॥ (సవ్యం) ప్రత్యఙ్ముఖో భూత్వా ।

**క్రియ :** కర్త సవ్యం చేసుకొని పడమర ముఖముగా కూర్చోవాలి. మండలాలకు తూర్పు దిక్కుగా వచ్చి విశ్వేదేవభోక్త మండలానికి పశ్చిమంగా తూర్పు ముఖంగా నిలబడాలి.

సూ॥ పురూరవార్ద్రవ సంజ్ఞికా విశ్వేదేవాః । (కర్త) స్వాగతం । (భోక్త) సుస్వాగతం అనాలి. దర్భను విశ్వదేవ స్థానములో ఉన్న భోక్త పాదాలమీదుగా తుడుస్తూ ఉత్తరప్రక్కగా ఉంచవలె.

సూ॥ పాద్యస్థానే (కర్త) ఇదమాసనం । (భోక్త) సుఖాసనం అనాలి. కూర్చునే ఆసనము మీద రెండు దర్భలు తూర్పు అగ్రంగా ఉంచాలి. భోక్త ఆసనముమీద కూర్చోవాలి.

(కర్త) పురూరవార్ద్రవసంజ్ఞకా విశ్వేదేవాః ఇదంవః పాద్యమిదం వః పాద్యం

**క్రియ :** పాదాలపై నీరు చల్లాలి.

(భోక్త) సుపాద్యం

సూ॥ శన్నోదేవీ రభిష్టయ ఆపోభవంతుపీతయే । శంయోరభిస్రవంతునః ।

సూ॥ పవిత్రం విసృజ్య ।

**క్రియ :** పవిత్రం తీసి గ్లాసులో ఉంచాలి. చతురస్రమండలం మీద ఇత్తడి పళ్లెం పెట్టి దానిలో భోక్త కాళ్లుండేటట్లు తూర్పుముఖంగా కూర్చోపెట్టాలి. కింది మంత్రం చదువుతూ కర్త భోక్త పాదాలు తాకుతూ కడగాలి. సీలమండనుంచి వేళ్లవరకు ఆ క్రమంలో కడగాలి. ఈ సమయంలో భోక్తదర [illegible] ర్దను తాకు [illegible] ాలి.

మం. చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతస్తరతి దుష్కృతాని । తేనపవిత్రేణ శుద్ధేనపూతా అతిపాప్మాన మరాతింతరేమ । లోకస్య ద్వారమర్చిమత్పవిత్రం । జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్ । అమృతస్య ధారా బహుధా దోహమానం చరణంనోలోకే సుధితాం దధాతు । నమో బ్రహ్మణ్యదేవాయ గో బ్రాహ్మణహితాయ చ । జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః ।

సూ॥ పవిత్రంధృత్వా

మం. శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవ స్సవితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ-వసోస్సూర్యస్య రశ్మిభిః

**క్రియ :** పవిత్రము ధరించవలె. కర్త కుడి హస్తమున నేయి రాసుకొని భోక్త పాదముల బొటనవ్రేళ్ల క్రింద హస్తముంచి పై నుంచి నీరు పోసి ఆ పాదోదకమును తన శిరస్సున చల్లుకొనవలె. సోదరులమీద కూడా చల్లాలి. ఈవిధంగా చల్లుకోనక్కరలేదని పైతృక సంగ్రహంలో ఉన్నది.

మం॥ (భోక్త) మయిమహో మయియశో మయీం ద్రియంవీర్యం ।

**క్రియ :** కర్త భోక్త చేతిమీద (కడుగుకోడానికి) నీళ్లు పోయ్యాలి.

సూ॥ పితృపితామహప్రపితామహాః (మాతృ పితామహీ ప్రపితామహ్యాః)

(కర్త) స్వాగతం (భోక్త) సుస్వాగతం

**క్రియ :** దర్భనుపితృస్థాన భోక్త పాదాలమీదుగా తుడుస్తూ దక్షిణ దిక్కుగా వదలాలి.

సూ॥ ప్రాచీనావీతీ అస్మత్ పితృ (మాతృ)

పితామహ (పితామహీ) ప్రపితామహాః (ప్రపితామహ్యాః) ... గోత్రా ... శర్మాణః (దాయీ) వసురుద్రాదిత్యరూపాః ఇదం వః పాద్యం ఇదం వః పాద్యం (భోక్త) సుపాద్యం

మం. శన్నోదేవీరభీష్టయ ఆపోభవంతు పీతయే శంయోరభి స్రవంతునః

**క్రియ :** పవిత్రం తీసి గ్లాసులో ఉంచాలి. వర్తుల మండలంమీద భోక్త పాదాలుండేటట్లు ఉత్తర ముఖంగా కూర్చోపెట్టి కింది మంత్రం చదువుతూ కర్త భోక్త పాదాలు తాకుతూ కడగాలి. సీలమండ నుండి వేళ్లవరకు ఆ క్రమంలో కడగాలి. ఈ సమయంలో భోక్త దర్భతో కర్తను తాకుతూ ఉండాలి. సవ్యం। పవిత్రం। విసృజ్య।

మం. చరణం పవిత్రం వితతం పురాణం

యేన పూతస్తరతి దుష్కృతాని ।

తేనపవిత్రేణ శుద్ధేన పూతా

అతిపాప్మాన మరాతింతరేమ ।

లోకస్యద్వారమర్చిమత్పవిత్రం ।

జ్యోతిష్మత్ భ్రాజమానం మహస్వత్ ।

అమృతస్యధారా బహుధాదోహమానం ।

చరణం నో లోకేసుధితాం దధాతు ।

శ్లో॥ నమోబ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయ చ

జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః

సూ॥ కర్తాపవిత్రం ధృత్వా । ప్రాచీనావీతీ

**క్రియ :** పవిత్రం ధరించి ప్రాచీనావీతి చేసుకోవాలి.

మం. శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవో వస్సవితో త్పునాత్వ

చ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్యరశ్మిభిః ।

**క్రియ :** కర్త కుడి చేతికి నెయ్యి రాసుకుని భోక్త పాదాల బొటన వేళ్ల కింద ఆ హస్తముంచి పై నుంచి నీరు పోసి ఆ పాదోదకా[illegible] తలమీద [illegible]లి.

(భోక్త) మం॥ మయిమహో మయియశో మయీంద్రియం వీర్యం

**క్రియ :** కర్త భోక్త చేతిమీద నీళ్లు పొయ్యాలి.

(సవ్యం) కర్తా స్వయంచ పాదౌ ప్రక్షాళ్య । ఈశాన్యముఖ ఉపవిశ్య అచమ్య । విశ్వే దేవాః ప్రాఙ్ముఖాః । పితర ఉదఙ్ముఖాః । అచమ్య । భోక్తురాచ మనాత్పూర్వం కర్తురాచమనం విధిః ।

**క్రియ :** కర్త సవ్యం చేసుకుని వేరే నీళ్లతో పాదములు కడుగుకొని గ్లాసులో నీళ్లు పారబోసి వేరేనీళ్లు గ్లాసులో పోసుకుని దేవమండలానికి ఉత్తరంగా ఈశాన్యముఖముగా కూర్చొని అచమనము చేసి పవిత్రం విసర్జించి (ముడివిప్పి) కొత్త పవిత్రం ధరించాలి. విశ్వదేవ స్థానములో భోక్త తూర్పు ముఖముగాను, పితృ (మాతృ) స్థానములో భోక్త ఉత్తరముఖముగాను ఉండి అచమనం చేయవలె. తదుపరి విడిచిన పవిత్రంతో సహ పాద ప్రక్షాళనకు తీసికెళ్లిన వస్తువులను అక్కడే ఉంచి వాటిమీద పీటలు బోర్లించాలి.

**ఆసనములు :**

కర్త, భోక్తలు లోపలికి వెళ్లాలి. భోక్తలు వారి ఆసనముల వెనుక నిలబడాలి. కర్త తూర్పుముఖంగా కూర్చుని పురాణాచమనం చెయ్యాలి.

ఓం కేశవాయ స్వాహా ... శ్రీకృష్ణాయ నమః । పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః భూర్భువస్సువ స్వాహాస్తాం అయంవోవిష్టరః । అత్రోపవిశంతుభవంతః । విశ్వేదేవ స్థానములో ఆసనము మీద రెండు దర్భలు తూర్పు అగ్రంగా ఉంచి బొటనవ్రేలు కాక తక్కిన నాలుగు వేళ్లతో విశ్వేదేవ భోక్త చెయ్యి పట్టుకొని ఆసనంమీద కూర్చో పెట్టాలి. అప్పుడు భోక్త అత్రోపవిశామః । అనాలి. (ప్రాచీనావీతి।) పితృపితామహ ప్రపితామహాః । (మాతృపితామహి ప్రపితామహ్యాః) భూర్భువస్సువస్స్వధాస్తాం అయంవోవిష్టరః అత్రోపవిశంతు భవంతః । పితృ (మాతృ) స్థానములో ఆసనము మీద మూడు దర్భలు దక్షిణాగ్రాలుగా ఉంచి భోక్తను విశ్వేదేవ భోక్తనువలెనే కూర్చో పెట్టాలి. (భోక్త) అత్రోపవిశామః అనాలి ఇక్కడి నుంచి భోక్తలు వారు చెప్పవలసిన మంత్రాలు మాత్రమే ఉచ్చరించుచూ ఇతరత్రా మౌనం పాటించాలి. **సూ॥** ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ (ప్రాచీనావీతీ)

యజమానస్య (అస్మత్) పితుః (మాతుః ।) ప్రాతి సాంవత్సరీక మృతాహోఖ్యాన్న శ్రాద్ధే భవదనుజ్ఞయా ప్రక్రాంతం శ్రాద్ధకర్మ (సవ్యం) (కర్మ) కరిష్యే । (భోక్తలు) కురుష్వ అనాలి. పళ్లెములో నీళ్లు వదలాలి.

**క్రియ :** పితృస్థాన భోక్త భజన స్థలంలో దర్భలుంచి వాటిని ఎత్తి మళ్లీ ఉంచి నీళ్లు చల్లాలి.

ఎడమచేతిలో నువ్వులు తీసుకుని కింది మంత్రం చదువుతూ కుడిచేత్తో తూర్పున ప్రారంభించి గదికి నాలుగువైపులా నువ్వులు చల్లాలి.

మం. అపహతా అసురా రక్షాగ్ంసి పిశాచా యేక్షయంతి పృథివీమను । అన్యత్రేతో-

గచ్ఛంతు యత్రైషాం గతంమనః ।

**సూ॥** పిత్రార్థ బ్రాహ్మణ భోజనస్థానే దర్భేణ సంమృజ్య । దర్భేణతూష్ణీ ముద్ధృత్యావోక్ష్య ఉదీరతామవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితరస్సోమ్యాసః । అసుంయఈయురవృకా ఋతజ్ఞా స్తేనోవంతుపితరో హవేషు ।

సూ॥ ఇతికూర్చోదకేనావోక్ష్య । ఉద్ధృత్య । తిలాన్ వికిరేత్ । తూష్ణీం వర్తులాకార మండలత్రయం కృత్వా ।

**క్రియ :** కూర్చతో తాకించిన మూడుచోట్ల ఉత్తరం నుంచి దక్షిణానికి మూడు చిన్న మండలములు గుండ్రముగా చేయాలి. (నీళ్లతో అప్రదక్షిణంగా అలకాలి)

సూ॥ తిలదర్భాన్ నిక్షిప్య । తదుపరి తిలోదకేనావోక్ష్య ।

**క్రియ :** మూడు మండలములమీద వేరువేరుగా పెదమరలుగా తిలలు, నిలువుగా దర్భలు ఉంచుతూ కర్త ఇలా అనాలి.

సూ॥ పితరో హవేషు । పితామహా హవేషు । ప్రపితామహాహవేషు । (మాతరో హవేషు । పితామహ్యోహవేషు । ప్రపితామహ్యోహవేషు)

(సవ్యం) సూ॥ విశ్వేదేవస్థానే సవ్యేన యవోదకేనా వోక్ష్య తూష్ణీం చతురస్ర మండలద్వయం కృత్వా

**క్రియ :** విశ్వదేవస్థానములో యవలు (లేక అక్షతలు) నీరు చల్లాలి.

అచట నాలుగు పలకలుగా రెండు మండలములు పశ్చిమం నుంచి తూర్పుకి ప్రదక్షిణంగా చెయ్యాలి.

సూ॥ యవదర్భాన్ నిక్షిప్య ।

**క్రియ :** యవలు (అక్షతలు) నిలువుగా తూర్పు అగ్రంగా దర్భలు రెండు మండలములమీద ఉంచుతూ ఇలా అనాలి.

సూ॥ పురూరవ సంజ్ఞకా విశ్వేదేవా హవేషు । ఆర్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవా హవేషు ।

సూ॥ తిలాక్షతదర్భానాదాయ గాయత్ర్యాచాత్మా నంపాకద్రవ్యాణి చ సంప్రోక్ష్య॥

మం. ఓం భూర్భువస్సువః ... దయాత్ ॥

**క్రియ :** తిలలు, అక్షతలు, దర్భలు, నీళ్లు చేతిలో తీసుకుని పై గాయత్రీ మంత్రం చదువుతూ కర్త తనమీద (సమిష్టిగా అయితే సోదరులమీద) అక్కడ ఉన్న ద్రవ్యాలు మీద నీళ్లు మాత్రం చల్లాలి.

శ్లో॥ అపవిత్రః పవిత్రోవాసర్వావస్థాంగతోపివా ।
యస్మరే త్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః ॥

**క్రియ :** వండిన పదార్థాలన్నింటిమీద (మూతలు తీయించి) నీళ్లు చల్లాలి.

సూ॥ అన్నాది పాకద్రవ్యాణిసంప్రోక్ష్య

సూ॥ (కర్త) శ్రాద్ధార్థం సంపాదితాః పదార్థా దేశతః కాలతశ్చశ్రాద్ధయోగ్యా ముఖ్యాభవంత్వితి భవంతో బ్రువంతు (భోక్తలు) శ్రాద్ధయోగ్యాముఖ్యాభవంతు ।

శ్లో॥ శ్రాద్ధకాలే గయాంధ్యాత్వా ధ్యాత్వా దేవం జనార్దనం ।
వస్వాదీంశ్చపితౄన్ ధ్యాత్వాతత శ్రాద్ధం (కర్త) ప్రవర్తయే । (భోక్తలు) ప్రవర్తయ

**విశ్వేదేవార్చన :** కర్త కుడిమోకాలు, ఎడమపాదం నేలపై ఆన్చి ఉత్తరముఖంగా భోక్తకు దగ్గరగా కూర్చోవాలి.

సూ॥ పురూరవార్ద్రవసంజ్ఞికానాం విశ్వేషాందేవానా (కర్త) మిద మిదమాసనం

**క్రియ :** విశ్వదేవ స్థానంలో రెండు దర్భలు తూర్పు అగ్రాలుగా ఉంచాలి. భోక్త-సుఖాసనం అనాలి.

సూ॥ హస్తోదకందత్వా ।

**క్రియ :** ఎడం చేత్తో కూర్చతో నీటిని తన కుడిహస్తమున చల్లుకొని సోదరుల కుడిచేతుల్లో చల్లి కుడిచేత్తో భోక్త కుడిహస్తమున చల్లాలి.

సూ॥ విశ్వేదేవ దైవేక్షణః క్రియతాం ।

**క్రియ :** భోక్త శిరస్సుమీద అక్షతలు చల్లి దర్భచేతికి ఇవ్వాలి.

సూ॥ ఓం తథా । (కర్త) ప్రాప్నువంతుభవంతః (భోక్త) ప్రాప్నవామ.

తతః ప్రదక్షిణ్యేన దర్భేషు అర్ఘ్యపాత్రే అసాద్య । ఉపరిదర్భానాస్తీర్య ।

**క్రియ :** రెండు చతురస్ర మండలములమీద తూర్పు, పడమరలుగా దర్భలు ఉంచి వాటిమీద రెండు అర్ఘ్యపాత్రలను (దొన్నెలు) నిలువుగా (తూర్పు పడమరగా) బోర్లించి వాటిపైన దర్భలుంచాలి.

సూ॥ ఉత్తానే ప్రోక్ష్య ।

**క్రియ :** దొన్నెలు తిరగేసి కూర్చతో నీటిని తీసుకొని ఆ రెండు దొన్నెలపై చల్లాలి.

సూ॥ ఉద్ధృత్య । పునః ప్రోక్ష్య ।

క్రియ : దొన్నెలను విడివిడిగా ఎత్తి మళ్ళీ కింద ఉంచి వాటిని కూర్చతో నీరు చల్లాలి.

సూ॥ యవాన్ వికీర్య । (రెండుసార్లు చెప్పాలి)

**క్రియలు :** యవలు (లేక అక్షతలు) రెండు దొన్నెలలోను ఉంచాలి.

సూ॥ ఉదకమాపూర్య । (రెండుసార్లు) దొన్నెలలో నీళ్ల పోయాలి. ప్రతిదొన్నెలోను పోసే నీరంతా ఒకేసారిగా పోయాలి.

మం. శన్నోదేవీరిత్యభిమంత్ర్య । శన్నోదేవీరభిష్టయ ఆపోభవంతు పీతయే ।

శంయోరభిస్రవంతునః । ద్విస్తూష్ణీం । యవోసిధాన్యరాజో వా వారుణో మధు

సంయుతః । నిర్ణోదస్సర్వ పాపానాం పవిత్రమృషిభిస్మృతం ।

**క్రియ :** రెండు హస్తములు దోసిలివలె తూర్పు దొన్నెవైపు చూపుతూ పై మంత్రాన్ని తిరిగి ఇదేవిధంగా పడమరవైపు దొన్నెకు చేయాలి పఠించాలి.

సూ॥ యవాన్ నిక్షిప్యా ।

క్రియ : యవలు లేక అక్షతలు వాటిలో ఉంచవలె.

సూ॥ అర్ఘ్యపాత్రయోరయం గంధః । వాటిలో రెండుసార్లు గంధమునుంచవలె.

సూ॥ పుష్పార్థాఇమే అక్షతాః (రెండుసార్లు)

**క్రియ :** వాటిలో అక్షతలు ఉంచాలి.

సూ॥ ఇమే కుశాః । ఇమే కుశాః ।

**క్రియ :** వాటిలో దర్భలుంచాలి.

సూ॥ కూర్చోదకేనైవ అష్టార్ఘ్యైస్సంపూర్ణార్చన మస్తు (రెండుసార్లు) ఇమానిశ్రీ, తులసీ, భంగరాజ, దర్భపత్ర, తృణానిచ । ఔదుంబరపర్ణైః ప్రచ్ఛాదయతిదర్భైర్వా ।

**క్రియ :** కూర్చతో వేరువేరుగా రెండు దొన్నెలయందు ఉదకముంచి పైన దర్భలుగాని, మేడిఆకులు గాని ఉంచాలి.

సూ॥ పురూరవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యో దేవేభ్యో వోజుష్టం గృహ్ణామి । అత్రచ ఆర్ద్రవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యోదేవేభ్యోవోజుష్టం గృహ్ణామి । వః పాత్రే (కర్త) సంపన్నే (భోక్త) సుసంపన్నే (కర్త) స్వాహోర్ఘ్యాః స్వాహోర్ఘ్యాః (భోక్త) స్తామర్ఘ్యా

**క్రియ :** కర్త హస్తములతో దొన్నెలను తాకాలి.

సూ॥ పురూర వార్ద్రవ సంజ్ఞకాన్ విశ్వాన్ దేవాన్ భవత్సుభవత్సుచ ఆవాహయిష్యే॥ (భోక్త) ఆవాహయ

**క్రియ :** ఎడమచేతితో భోక్త కుడికాలు తాకాలి. రెండు దర్భలను గంధములో ముంచి అక్షతలు అంటించి విశ్వదేవ స్థానములోని భోక్త శిరస్సుమీద ఉంచి కర్త కింది మంత్రము చెప్తూ నమస్కరించవలె.

మం. విశ్వేదేవాస ఆగతశ్శృణుతామ ఇమగ్ంహవం । ఏదంబర్హిర్నిషీదత ।

విశ్వేదేవాశ్శృణుతే మగ్ం హవంమేయే అంతరిక్షేయ ఉపద్యవిష్ఠ । యె అగ్ని

జిహ్వా ఉతవాయజత్రా ఆసద్యాస్మిన్బర్హిషి మాదయధ్వం ।

శ్లో॥ ఆగచ్ఛంతుమహాభాగా విశ్వేదేవా మహాబలాః । ఏహ్యత్రవిహితా శ్రాద్ధే (కర్త) సావధానా భవంతుతే । (భోక్త) సావధానాస్మః అనాలి.

సూ॥ (హస్తోదకం దత్వా)

**క్రియ :** కూర్చతో కర్త హస్తోదకము తీసికొని భోక్తకు ఇవ్వాలి.

సూ॥ దర్భన్నినీయ ।

**క్రియ :** పవిత్రం తీసి గ్లాసులో పెట్టుకొని మొదటిదొన్నె పై దర్భలు భోక్తకిచ్చి, కింది దర్భలతో సహ దొన్నెను తీసుకుని ఎడమచేతిలో ఉంచుకుని కుడిమోకాలుపై ఆన్చి కుడిచేతితో మూయాలి.

మం. యాదివ్యా ఆపః పయసాసంబభూవుర్యా అంతరిక్ష ఉత పార్థివీర్యాః ।

హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గ్స్యోనా స్వాహా భవంతు ।

సూ॥ పురూరవసంజ్ఞకా విశ్వేదేవా (కర్త) ఇదంవో అర్ఘ్యం । (భోక్త) అస్త్వర్ఘ్యం

**క్రియ :** ఇప్పుడు ఎడమచేతిలోని దొన్నెలోని జలాన్ని కుడిచేతిద్వారా భోక్త కుడిచేతిలోకి వదలాలి. ఈ సమయంలో సోదరులతో కలిసి పెడుతుంటే వారి చేతులు క్రమంగా కర్త ఎడమచేతిమీద ఉంచాలి. ఈ నీళ్లు నేలపై పడకూడదు కాబట్టి కింద పళ్లెం ఉంచాలి. (దొన్నెలు చిరగకుండా దృఢంగా ఉండాలి) భోక్త కుడివైపున తూర్పు అగ్రంగా ఒక దర్భవేసి దానిమీద ఖాళీదొన్నెను బోర్లించి చేతిలోని దర్భలు పళ్లెంలో వదలాలి. పవిత్రం ధరించాలి

సూ॥ పునఃహస్తే శుద్ధోదకం దర్భంనినీయ

**క్రియ :** మళ్లీ కూర్చతో హస్తోదకం తను తీసికొని, తర్వాత భోక్తకీయాలి. దర్భచేతికి ఇయ్యాలి.

మం. యాదివ్యా అపః పయసా సంబభూవుర్యా అంతరిక్ష ఉతపార్థివీర్యాః ।

హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్ స్యోనా స్వాహా భవంతు । ఆర్ద్రవ సంజ్ఞకా

విశ్వేదేవా । (కర్త) ఇదం వో అర్ఘ్యం ।

**క్రియ :** పవిత్రం తీసి గ్లాసులో ఉంచి రెండవదొన్నె, పై దర్భలు భోక్తకు ఇచ్చి కింది దర్భలు కర్త తీసుకొని అదివరకులాగానే అర్ఘ్యమివ్వాలి. (భోక్త) అస్త్వర్ఘ్యం అనాలి.

భోక్త కుడివైపున ఉన్న దర్భమీద అదివరకటి దొన్నె పక్క ఈ అర్ఘ్యపాత్రను బోర్లించాలి. చేతిలోని దర్భలను పళ్ళెంలో వదిలేయాలి. పవిత్రం ధరించాలి.

సూ॥ తత శ్శుద్ధోదకమ్ । విశ్వేభ్యో దేవేభ్యః పాత్రేస్థానే స్థః ।

భోక్త : స్వస్థానమసి ! తతశ్శుద్ధోకం

**క్రియ :** కూర్చతో హస్తోదకం తను తీసికొని, తర్వాత భోక్తకీయాలి.

**తతః అర్చనం :** అర్చత ప్రార్చతప్రియమేధాసో అర్చత । అర్చంతుపుత్రకా ఉతపురన్న ధృష్ణ్వర్చత అర్చతప్రార్చత గంధద్వారాందురాధర్ షాం నిత్యపుష్టాంకరీషిణీం ఈశ్వరీగ్ం సర్వభూతానాంతా మిహోపహ్వయేశ్రియం । పురూరవార్ద్రవ సంజ్ఞికా విశ్వేదేవాః । (కర్త) యథాభాగశః అమీవోగంధాః ।

**క్రియ :** పవిత్రం తీసి ఆకులోని గంధాన్ని ఆకుతోసహా భోక్తకీయాలి. (భోక్త) సుగంధాః అనాలి. కర్త పవిత్రం ధరించాలి.

మం॥ ఆయనేతే పరాయణే దూర్వారోహంతు పుష్పిణీః హ్రదాశ్చపుండరీకాణి సముద్రస్య గృహా ఇమే । పురురవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః ।

సూ॥ పుష్పార్థా ఇమే అక్షతాః

**క్రియ :** భోక్త శిరస్సుమీద అక్షతలు ఉంచాలి. (భోక్త) సుపుష్పాణి అనాలి.

మం. ధూరసిధూర్వ ధూర్వంతం ధూర్వతం యోస్మాన్ ధూర్వతితం ధూర్వయం

వయంధూర్వామః ।

**క్రియ :** భోక్త కుడి అరచేతిలో కూర్చ తాకించాలి.

సూ॥ పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః (కర్త) ఉదకద్రవ్యేణైవసాంకల్పికోవో ధూపః

**క్రియ :** ఉదక రూపముగా అగరు ధూపము చూపాలి. (మానసికముగా భావన చేయాలి) (భోక్త) సుధూపః । అనాలి.

మం. ఉద్దీప్యస్వ జాతవేదో పఘ్నన్నిర్‌ఋతిం మమ । పశూగ్‌శ్చ మహ్యమావహ

జీవనంచ దిశోదిశ ॥ పురూరవార్ద్రవ సంజ్ఞికా విశ్వేదేవాః । (కర్త) పూర్వదిక్థల-

మిదంవోజ్యోతిః ।

**క్రియ :** దీపాన్ని చూపాలి. (భోక్త) సుజ్యోతిః । అనాలి. లోగడ చేసిన దీపారాధనలో నూనె వేయాలి.

మం. యువాసువాసాః పరివీత ఆగాత్స ఉశ్రేయా న్భవతి జాయమానః । తంధీరాసః

కవయ ఉన్నయంతి స్వాధియోమనసా దేవయంతః ।

సూ॥ పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః । అంతఃప్రావరణార్థం బహిః ప్రావరణార్థం వః ఆచ్ఛాదనార్థం ఇదం వోవాసః । (భోక్త) సువాసః

**క్రియ :** తడిపిన పంచె, ఉత్తరీయం ఇవ్వాలి. (చాలామంది ఇక్కడ "వస్త్రార్థం సాక్షతాఇమేకుశాః" సుకుశాః (భోక్త) అని దర్భలు, అకతలు ఇస్తున్నారు ఇది సరికాదు. కనీసం ప్రత్యామ్నాయంగా యజ్ఞోపవీతం ఇవ

సూ॥ వః ఆచ్ఛాదనార్థం, పవిత్రార్థం, అలంకరణార్థం సాక్షతా ఇమే కుశాః ।
(భోక్త) సుకుశాః । అర్చనం సంపూర్ణం । అస్తు సంకల్పసిద్ధి రస్త్వితి భవంతో బ్రువంతు
(భోక్త) భవతాం । అస్తు సంకల్ప సిద్ధిః ।

**కర్త :** భవదనుజ్ఞయా పిత్రాద్యర్చనం (మాత్రాద్యర్చనం) కరిష్యే ।

**క్రియ :** పళ్లెములో నీళ్లు వదలాలి. (భోక్త) కురుష్వ । అనాలి.

**పిత్రాద్యర్చనం :** కర్త ఎడమమోకాలు, కుడిపాదం నేలమీద ఆనేటట్లు దక్షిణముఖంగా పితృస్థాన భోక్త ఎదురుగా కూర్చోవాలి. ప్రాచీనావీతీ

సూ॥ పితృ (మాతృ) స్థానే హస్తోదకం దత్వా ।

**క్రియ :** హస్తోదకము కర్త (సోదరులు) తీసుకొని పితృ (మాతృ) స్థానములోని భోక్తకు ఇవ్వాలి.

సూ॥ యజమానస్య (అస్మత్) పితృ పితామహ ప్రపితామహానాం .... గోత్రాణాం .... శర్మణాం .... (మాతృ పితామహీ ప్రపితా మహీనాం గోత్రాణాం .... దాయీనాం) వసురుద్రాదిత్యరూపాణా (కర్త) మిదమిద మాసనం ।

**క్రియ :** పితృ (మాతృ) స్థానములో భోక్త పీట కింద మూడు దర్భలు ఉంచవలె. (భోక్త) సుఖాసనం అనవలె.

సూ॥ హస్తోదకం దత్వా అస్మత్ పితుః (మాతుః) ప్రాతి సాంవత్సరీక మృతాహోఖ్యాన్న శ్రాద్ధే క్షణః క్రియతామ్ । ఓం తథా (కర్త) ప్రాప్నువంతు భవంతః (భోక్త) ప్రాప్నవామ

**క్రియ :** భోక్త శిరస్సుపై తిలలు చల్లి దర్భచేతికివ్వాలి అనాలి.

సూ॥ తతోదక్షిణాగ్రేషు దర్భేషు దక్షిణాపవర్గ త్రీణి అర్ఘ్యపాత్రాణ్యా సాద్య ।

**క్రియ :** ప్రతి వృత్తాకారమండలంమీద (ఉత్తరం నుంచి దక్షిణానికి) పెడమరలుగా విడిగా మూడేసి దర్భలుంచి వానిమీద నిలువుగా దొన్నె (అర్ఘ్యపాత్ర)లు బోర్లించాలి. ఈ దొన్నెలతో క్రియలన్నీ ఉత్తరం నుంచి దక్షిణానికే

సూ॥ ఉపరిదర్భానాస్తీర్య ।

**క్రియ :** వాటిమీద పెడమరలుగా దర్భలుంచాలి.

సూ॥ ఉత్తానాని్రప్రోక్ష్య ।

**క్రియ :** దొన్నెలు తిరగతీసి కూర్చతో నీటిని తీసుకొని ఆ మూడు దొన్నెలమీద చల్లాలి.

సూ॥ ఉద్ధృత్య ।

**క్రియ :** దొన్నెలు ఎత్తి మళ్లీ కింద పెట్టాలి.

సూ॥ పునః ప్రోక్ష్య ।

**క్రియ :** మరల కూర్చతో నీటిని తీసుకొని ఆ మూడు దొన్నెలలో చల్లాలి.

సూ॥ తిలాన్వికీర్య ।

**క్రియ :** వాటిలో పెడమరలుగా తిలలు ఉంచాలి.

సూ॥ ఉదకమాపూర్య ।

**క్రియ :** వాటిలో పెడమరలుగా ఉదకము పోయాలి.

మం. శన్నోదేవీరిత్యభిమంత్ర్య । శన్నోదేవీరభిష్టయ ఆపోభవంతు పీతయే । శంయోరభి స్రవంతునః ।

**క్రియ :** బోర్లగా కుడిహస్తముపై ఎడమ హస్తము ఉంచి విడివిడిగా ఆ మూడు దొన్నెలవైపు చూపుతూ కింది మంత్రం చదవాలి.

మం॥ తిలోసిసోమదేవత్యో గోసవోదేవనిర్మితః । ప్రత్నవద్భిః ప్రత్నవస్స్వధ ఏహి।

అస్మత్ పితరం ....గోత్రం ....శర్మాణం(మాతరం .... గోత్రాం ... దాయీం....) వసురూపం (వసురూపాం) ఇమాన్ లోకాన్ ప్రీణయాహినస్స్వధానమః ।

**క్రియ :** ఎడమ మోకాలు నేలకాన్చి, ఎడమచెయ్యి కుడిచేతిమీదుగా నేలకాన్చి, కుడిబొటన వ్రేలితో తడి చేసుకొని తిలలు గ్రహించి మొదటిదొన్నెలో పెడమరలుగా ముంచవలె.

మం॥ తిలోసిసోమదేవత్యో గోసవోదేవ నిర్మితః । ప్రత్నవద్భిః ప్రత్నవస్స్వధ ఏహి । అస్మత్ పితామహం ... గోత్రం ... శర్మాణం రుద్రరూపం (పితామహీం ... గోత్రాం .... దాయీం ....) రుద్రరూపాం ఇమాన్ [illegible] ణయా [illegible] నమః

**క్రియ :** మొదటి దొన్నెలోలాగానే రెండవ దొన్నెలో చెయ్యాలి.

మం॥ తిలోసిసోమదేవత్యో గోసవోదేవనిర్మితః । ప్రత్నవద్భిః ప్రత్న వస్స్వధ ఏహి । అస్మత్ ప్రపితామహం ... గోత్రం ... శర్మాణం ఆదిత్యరూపం (ప్రపితామహీం ..... గోత్రాం .... దాయీం ....) ఆదిత్యరూపాం ఇమాన్ లోకాన్ ప్రీణయాహినస్స్వధా నమః

**క్రియ :** మొదటి రెండు దొన్నెల్లోలాగానే మూడవ దొన్నెలో చెయ్యాలి.

సూ॥ (సవ్యం) అర్ఘ్యపాత్రేషు ఆయం గంధః । (3సార్లు) పవిత్రం తీసి మూడు దొన్నెలయందు గంధముంచి పవిత్రం ధరించాలి.

సూ॥ పుష్పార్థాఇమేతిలాః ।

**క్రియ :** మూడు దొన్నెలలోను, నువ్వులు ఉంచాలి.

సూ॥ అయంకుశః

**క్రియ :** మూడు దొన్నెలలోను దర్భలుంచాలి.

సూ॥ కూర్చోదకేనైవ అష్టైర్ఘ్యెస్సంపూర్ణార్చన మస్తు । ఔదుంబర పర్ణైః ప్రచ్ఛాదయతిదర్భైర్వా ।

**క్రియ :** కూర్చతో మూడు దొన్నెలయందు ఉదకం చల్లి పైన పెడమరలుగా దర్భలు గాని మేడిఆకులుగాని మూతగా ఉంచాలి. కింది మంత్రం చెప్పాలి.

సూ॥ పిత్రే తేవోజుష్టం గృహ్ణామి । పితామహా యతేవోజుష్టంగృహ్ణామి ·। ప్రపితామహా యతేవోజుష్టం గృహ్ణామి । (మాత్రేతేవోజుష్టం గృహ్ణామి । పితామహ్యై తేవోజుష్టం గృహ్ణామి । ప్రపితామహ్యైతేవోజుష్టం గృహ్ణామి ।

(కర్త) వః పాత్రాణి సంపన్నాని । (భోక్త) సుసంపన్నాని అనాలి.

(కర్త) స్వధార్ఘ్యాః స్వధార్ఘ్యాః సంత్వర్ఘ్యాః । (భోక్త) సంత్వర్ఘ్యాః పితృ పితామహ ప్రపితామహాన్ .... గోత్రాన్ .... శర్మణః (మాతృ పితామహీ ప్రపితా మహీః .... గోత్రాః .... దాయీః) వసురుద్రాదిత్య రూపాన్ భవత్సు భవత్సు చ ।

**క్రియ :** (కర్త) ఆవాహయిష్యే । అని ఎడమ చేత్తో భోక్త ఎడంకాలు తాకి తరవాత రెండు దర్భలను గంధములో ముంచి వాటికి తిలలు అంటించి పితృ (మాతృ) స్థానములోని భోక్త శిరస్సు మీద ఉంచాలి. (భోక్త) ఆవాహయ అనవలె.

అనంతరం కర్త సవ్యం చేసుకుని భోక్తకు నమస్కరిస్తూ కింది మంత్రం చెప్పాలి.

మం. ఉశంతస్త్వాహవామహ ఉశంతస్స మిధీమహి । ఉశన్ను శత ఆవహ । పితౄన్
హవిషే అత్తవే । ఆయంతునః పితర స్సోమ్యాసోగ్నిష్వాత్తాః పథిభి ర్దేవయానైః
అస్మిన్ యజ్ఞే స్వధయా మదం త్వధి బ్రువంతుతే అవంత్వ స్మాన్ ।

సూ॥ (కర్త) సావధానాభవంతుతే । (భోక్త) సావధానాస్మః

**క్రియ :** పితృ (మాతృ) స్థానములోని భోక్త చేతికి కూర్చ తాకి ఉంచాలి.

సూ॥ ప్రాచీనావీతీ । హస్తేశుద్ధోదకం । దర్భన్నినీయ ।

**క్రియ :** ప్రాచీనావీతి చేసుకొని, కూర్చతో హస్తోదకం తీసుకొని భోక్తకు ఇవ్వాలి.

పవిత్రం తీసి గ్లాసులో ఉంచి మొదటి దొన్నె పైదర్భలు భోక్తకిచ్చి, కింది దర్భలతో సహా దొన్నెను గ్రహించి ఎడమచేతిలో ఉంచుకుని ఎడమమోకాలుపై ఆన్చి కుడిచేత్తో మూయాలి.

మం. యాదివ్యా ఆపః పయసా సంబభూవుర్యా అంతరిక్ష ఉతపార్థివీర్యాః ।
హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనా స్స్వధా భవంతు । పితః .....
గోత్ర .... శర్మన్ వసురూప (మాతః .... గోత్రే .... దాయి .... వసురూపే)
(కర్త) ఇదం తే అర్ఘ్యం ।

**క్రియ :** (కర్తలు ఒకరికన్న ఎక్కువ ఉంటే వారి ఎడమ హస్తములు క్రమముగా ప్రధానకర్త ఎడమ హస్తానికి పైన ఉంచవలె. దొన్నెను చినిగిపోకుండా ఎడమచేతితో జాగ్రత్తగా పట్టుకుని ఆ దొన్నెలోని జలమును, పె ... ఉం ... స్తము ద్వారా భోక్త కుడి హస్తమున అర్ఘ్యమివ్వాలి. ... ర్ఘ్యం ... క్తకు

ఎడమపక్క దక్షిణాగ్రంగా దర్భనుంచి దానిపైన ఖాళీ అయిన అర్ఘ్యపాత్రను బోర్లించాలి. తరవాత ఇదేవిధంగా పితామహ ప్రపితామహులకు అర్ఘ్యం ఇచ్చిన తర్వాత ఖాళీ పాత్రలను ఈ దర్భపైనే క్రమంగా బోర్లించాలి. ప్రతిసారీ చేతిలోనున్న దర్భలను పళ్లెంలో వదలాలి.

సూ॥ పునః హస్తోదకం దత్వా ।

**క్రియ :** కూర్చతో హస్తోదకం తను సోదరులు తీసికొని, తర్వాత భోక్తకియ్యాలి.

సూ॥ దర్భన్నినీయ

**క్రియ :** మొదటి దొన్నెతో చేసినట్లే రెండవదొన్నెతో చెయ్యాలి.

మం. యాద్దివ్యా ఆపః పయసా సంబభూవుర్యా అంతరిక్ష ఉతపార్థివీర్యాః హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనా స్వధాభవంతు । పితామహః .... గోత్ర .... శర్మన్ రుద్రరూప (పితామహి .... గోత్రే .... దాయీ .... రుద్రరూపే) (కర్త) ఇదం తే అర్ఘ్యం ।

**క్రియ :** మొదటి దొన్నెతో ఇచ్చినట్లే అర్ఘ్యం ఇవ్వాలి. ఎడమచేతిదొన్నెలోని జలమును అర్ఘ్యమివ్వవలె. (భోక్త) అస్త్వర్ఘ్యం అనవలె.

సూ॥ తతశ్శుద్ధోదకమ్ ।

**క్రియ :** కూర్చతో నీటిని భోక్త హస్తమందుంచవలె.

సూ॥ పునః హస్తోదకం దత్వా । కూర్చతో హస్తోదకం తను తీసికొని, తర్వాత భోక్తకీయవలె.

సూ॥ దర్భన్నినీయ

**క్రియ :** అదివరకులాగానే మూడవదొన్నెతో చెయ్యాలి.

మం. యాద్దివ్యా ఆపః పయసా సంబభూవుర్యా అంతరిక్ష ఉతపార్థివీర్యాః । హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనాస్స్వధా భవంతు । ప్రపితామహ .... గోత్ర .... శర్మన్ ఆదిత్యరూప (ప్రపితామహి ... గోత్రే .... దాయి .... ఆదిత్యరూపే) (కర్త) ఇదం తే అర్ఘ్యం

**క్రియ :** దొన్నెలోని జలమును, అదివరకులాగానే అర్ఘ్యం ఇవ్వాలి. భోక్త అస్త్వర్ఘ్యం అనాలి.

సూ॥ తతశ్శుద్ధోదకమ్ ।

**క్రియ :** కూర్చతో నీటిని భోక్త హస్తమందుంచవలె.

సూ॥ పితృపితామహాః ప్రపితామహేభ్యః । (మాతృపితామహీ ప్రపితామహ్యాః) పాత్రాణిస్థానానిస్థః

భోక్త : స్వస్థానమసి

**క్రియ :** కూర్చతో హస్తోదకం తను తీసికొని, తర్వాత భోక్త కీయవలె. ప్రమాదవశాత్తు అర్ఘ్యప్రదానం చెయ్యకుండా తరువాత కార్యక్రమం జరిపితే, ఆ సంగతి ఆసీమాంతంలోపుగా ఎప్పుడు గుర్తించినా వెంటనే ప్రాయశ్చిత్త హోమాలుచేసి అర్ఘ్య పాత్రలు భోక్తలవద్ద ఉంచి తిరిగి అర్ఘ్యం ఇచ్చి మిగతా కార్యక్రమం కొనసాగించాలి. ఆసీమాంతం తరువాత గుర్తువస్తే కర్త ఆనాడు ఉపవసించి మర్నాడు తద్దినం పెట్టాలి.

**తతః అర్చనం :**

మం. పవిత్రం విసృజ్య। అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత । అర్చంతు పుత్రకా

ఉతపురన్న ధృష్ణ్వర్చత । అర్చతప్రార్చత । గంధద్వారాం దురాధర్షాం

నిత్యపుష్టాంకరీషిణీం । ఈశ్వరీగ్ం సర్వభూతానాంతా మిహో పహ్వయే శ్రియం।

పితృ పితామహ ప్రపితామహాః (మాతృ పితామహి ప్రపితామహ్యాః) (సవ్యం)

(కర్త) యథాభాగశః అమీవోగంధాః ।

**క్రియ :** పవిత్రం తీసి గ్లాసులో ఉంచి, కూర్చచేతితో పట్టుకొని, గంధము ఆకుతో సహా భోక్తకీయాలి. (భోక్త) సుగంధాః అనాలి.

మం. ఆయనేతే పరాయణే దూర్వారోహంతు పుష్పిణీః హ్రదాశ్చ పుణ్డరీకాణి సముద్రస్య

గృహా ఇమే । పితృ పితామహ ప్రపితామహ[illegible] పితామ[illegible]మహ్యాః

(కర్త) పుష్పార్థా ఇమే తిలాః ।

**క్రియ :** భోక్త శిరస్సుమిద తిలలు ఉంచాలి. (భోక్త) సుపుష్పాణి అనాలి. కూర్చను భోక్త కుడిచేతిలో తాకించాలి.

మం. ధూరసిధూర్వ ధూర్వంతం ధూర్వ తం యోస్మాన్ ధూర్వతితం ధూర్వయం వయంధూర్వామః । పితృ పితామహ ప్రపితామహాః (మాతృపితామహీ ప్రపితామహ్యాః) (కర్త) ఉదకద్రవ్యేణైవసాంకల్పికోవోధూపః ।

**క్రియ :** అగరు ధూపము చూపాలి. (మానసికముగా భావన చేయాలి) (భోక్త) సుధూపః । అనాలి.

మం. ఉద్దీప్యస్వ జాతవేదో పఘ్నన్నిర్‌ఋతిం మమ । పశూగ్‌శ్చ మహ్యామావహ జీవనంచ దిశోదిశ ॥ పితృ పితామహ ప్రపితామహాః (మాతృపితామహి ప్రపితామహ్యాః) (కర్త) దక్షిణదిక్స్థిత మిదంవోజ్యోతిః (భోక్త) సుజ్యోతిః॥

**క్రియ :** దీపాన్ని చూపాలి. (భోక్త) । సుజ్యోతిః । అనాలి.

సూ॥ యువాసువాసాః పరివీత అగాత్సఉశ్రేయా న్భవతిజాయమానః । తంధీరాసః కవయ ఉన్నయంతి స్వాధియోమనసా దేవయంతః । పితృ పితామహ ప్రపితామహాః (మాతృ పితామహీ ప్రపితామహ్యాః) అంతః ప్రావరణార్థం బహిః ప్రావరణార్థంవః అచ్ఛాదనార్థం మిదం వో వాసః । (సవ్యం)

**క్రియ :** తడిపిన పంచె, ఉత్తరీయం ఇవ్వాలి. లేక ప్రత్యామ్నాయంగా యజ్ఞోపవీతం ఇవ్వాలి. భోక్త సువాసః అనాలి.

సూ॥ వః ఆచ్ఛాదనార్థం, పవిత్రార్థం, అలంకరణార్థం, సతిలా ఇమే కుశాః । (భోక్త) సుకుశాః

**క్రియ :** దర్భలు తిలలు ఇవ్వాలి దీని తరువాత అర్చనం సంపూర్ణం

అస్తు సంకల్ప సిద్ధిరస్త్వితి భవన్తోబ్రువన్తు (భోక్త) భవతాం అస్తుసంకల్పసిద్ధిః

(సవ్యం) యుష్మదనుజ్ఞయా సర్వత్ర మండలాద్యర్చన, పాత్రాసాదనంచ కరిష్యే.

(భోక్తలు) కురుష్వ

క్రియ : నీళ్లు వదలాలి.

## అగ్నౌకరణము

శ్లో॥ కురుక్షేత్రం గయాం గంగాం ప్రభాసం పుష్కరాణిచ

ఏతానిమనసాధ్యాత్వా శ్రాద్ధకాలే సదాపఠేత్ - విష్ణుర్విష్ణుర్విష్ణుః

**క్రియ :** భోజనస్థలం శుద్ధి చేసి పాత్రలు (విస్తళ్లు) ఉంచాలి.

ఆచమ్య - పురాణాచమనం లేదా శ్రుత్యాచమనం చెయ్యాలి.

మం॥ ఓం ఓం ఓం అద్యపూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ (ప్రాచీనావీతి) యజమానస్య (అస్మత్) పితుః (మాతుః) ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే భవదనుజ్ఞయా, అన్నసంస్కారార్థం ఔపాసనాగ్నా వేవ (లౌకికాగ్నావేవ) అగ్నౌకరణం (సవ్యం) (కర్త) కరిష్యే. (భోక్తలు) కురుష్వ

**క్రియ :** పళ్లెములో నీళ్లు వదలాలి. విచ్ఛిన్నౌపాసన జరిగిన సందర్భాలలో ఔపాసనాగ్నిలోను, విచ్ఛిన్నౌపాసన అవసరం లేని సందర్భాలలో లౌకికాగ్నిలోను అగ్నౌకరణం చెయ్యాలి. అంటే ఇంటిలోని అగ్నిని అక్కడకు తెచ్చుకోవడం లేదా సమిధల్ని ప్రజ్వలింపచేయడం.

సూ॥ అన్నమగ్నావధిశ్రిత్య । దక్షిణత ఉద్వాస్య । అద్భిః ప్రోక్ష్య । అభిఘార్య

**క్రియ :** తూర్పు చిగురుగా ఉన్న అరిటాకులో కొంచెం అన్నము ఉంచి అగ్నిహోత్రముకు (ఆకు ఎత్తి) చూపి, ఆ ఆకును దక్షిణమున ఉంచాలి. ఆ అన్నము మీద నీరు చల్లాలి. అన్నము మీద నెయ్యి వెయ్యాలి.

సూ॥ అన్నం చతుర్ధా విభజ్య ।

**క్రియ :** రెండు దర్భలు తీసుకొని వానితో అన్నమును, నిలువుగాను, అడ్డముగాను విభజించి నాలుగు భాగములు చేయాలి.

సూ॥ ఆగ్నేయభాగే అభిఘార్య । కొంద[illegible] [illegible]గా ఈ [illegible]ందు చేయుదురు.

**క్రియ :** ఆగ్నేయ భాగమున ఉన్న అన్నము మీద నెయ్యి వెయాలి.

సూ॥ (ప్రాచీనావీతీ) తూష్ణీమప్రదక్షిణం పరిషిచ్య । కూర్చను అగ్నిహోత్రం చుట్టూ ప్రదక్షిణానికి వ్యతిరేక దిశలో తిప్పాలి.

సూ॥ సవ్యం । స్రుచ్యుపస్తీర్య

**క్రియ :** దర్భలతో స్రుక్కులోకి నెయ్యి అభిఘరించాలి.

సూ॥ చరుమధ్యాద్విరవదాయ

**క్రియ :** ఆగ్నేయ భాగమున ఉన్న అన్నములో సగమును రెండుసార్లు కొంచెం కొంచెంగా తీసుకుని స్రుక్కులో ఉంచాలి. (పంచావత్తులైతే మూడుసార్లు)

సూ॥ హవిః ప్రత్యభిఘారయతి ।

**క్రియ :** ఆగ్నేయ భాగంలో మిగిలిన అన్నం మీద అభిఘరించాలి.

సూ॥ పునరభిఘార్య

**క్రియ :** స్రుక్కులోని అన్నముపై నెయ్యి అభిఘరించాలి. స్రుక్కును చేతిలోకి తీసుకోవాలి.

సూ॥ ప్రాచీనావీతి

(క్రింద 1, 2, 3 హోమాలు కొన్ని ప్రాంతాలలో సవ్యంగానే చేస్తున్నారు)

1) మం॥ ఓమ్ సోమాయ పి॒తృ పీ॑తాయ స్వ॒ధా నమః । అర్ధం జుహోతి ।

**క్రియ :** స్రుక్కులోని అన్నములో సగాన్ని దర్భలతో అగ్నిలో దక్షిణంవైపునకు హోమం చెయ్యాలి.

**త్యాగం :** సోమాయపితృపీతాయేదం నమమ - శిష్టం పాత్రాంతరేనిధాయ

**క్రియ :** స్రుక్కులో మిగిలిన సగము అన్నము ఆకులో వేరేచోట ఉంచాలి.

సూ॥ సవ్యం - పునః స్రుచ్యుపస్తీర్య

**క్రియ :** తిరిగి స్రుక్కులోకిను దర్భలతో అభిఘరించాలి.

సూ॥ తేనా వదాయాభిఘార్య

**క్రియ :** ఆగ్నేయ భాగములో వదిలిన సగము అన్నమును

రెండుమార్లుగా స్రుక్కులోకి గ్రహించాలి. ఆ అన్నంపైన అభిఘరించాలి.

2) మం॥ ప్రాచీనావీతీ యమాయాంగిరస్వతే పితృమతేస్వధానమః । అర్థం జుహోతి ।

**క్రియ :** ఆ అన్నములో సగము అన్నము అగ్నిలో దక్షిణంవైపునకు హోమం చెయ్యాలి.

త్యాగం : యమాయాంగిరస్వతే పితృమత ఇదం నమమ

సూ॥ హోమశిష్టద్వయ మనుపస్తరణే నానభిఘారణేన జుహోతి ।

3) మం॥ అ॒గ్నయే॑ క॒వ్యవా॑హనాయ స్వ॒ధా॑ నమః ।

సూ॥ సర్వంజుహోతి

**క్రియ :** స్రుక్‌లో ఇపుడు మిగిలిన అన్నాన్ని ఆకులో ముందు ఉంచిన సగము అన్నాన్ని చేర్చి నేయి అభిఘరించకుండా హోమం చెయ్యాలి.

(త్యాగం) అగ్నయే కవ్యవాహనాయేదం నమమ ।

సూ॥ తూష్ణీ మప్రదక్షిణం పరిషిచ్య ।

**క్రియ :** అగ్నిహోత్రం చుట్టూ కూర్చతో అప్రదక్షిణముగా తిప్పాలి.

సూ॥ తూష్ణీం మేక్షణమగ్నౌ ప్రహరతి ।

**క్రియ :** మేక్షణి అనగా గరిటె అనగా దర్భలు అగ్నిలో వెయ్యాలి. కొందరు అన్నమును నాల్గు భాగములు చేయుటకు ఉపయోగించిన దర్భలను అగ్నిలో వేస్తున్నారు. అదిసరికాదు. దోషము. పార్వణపాత్ర కిందగాని, పితృస్థానం విస్తరికింద గాని ఉంచాలి. (స్మార్త వివేచనిక)

**గమనిక :** 1. విస్తరిలో మిగిలిన మూడు భాగాలలో నైరృతి భాగం పితృస్థాన భోక్త విస్తరిలోను వాయవ్యభాగం వికిరానికి ఈశాన్యభాగం పార్వణంలోను ఆయా సమయాల్లో ఉపయోగించాలి. ఈలోగా పిల్లులు వగైరా జంతువులు ముట్టుకుంటే హోమం చేసినప్పుడు అగ్నిచుట్టూ పడిన [illegible] అన్న[illegible] ఆయా సమయాల్లో వినియోగించాలి.

సూ॥ (సవ్యం) చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు ..... ప్రవరాన్విత ... గోత్ర .... సూత్రః ..... శాఖాధ్యాయీ .... శర్మ అహంభో అభివాదయే (యజమాని ప్రవర చెప్పుకొనవలె.)

**అన్నపరివేషణము :**

ప్రాచీనావీతీ పితృ (మాతృ) స్థానే హస్తోదకం దత్వా ।

**క్రియ :** కర్త హస్తోదకము తీసుకొని పితృ (మాతృ) స్థానములోని భోక్తకు ఇవ్వాలి.

సూ॥ భోజనపాత్రే అభిఘార్య । నైర్‌ఋతిభాగమాదాయ ।

హుతశేషమన్నం పితృపాత్రే పితృతీర్థేన స్వధేయమితినిక్షిప్య ॥ సవ్యం జాన్వాచ్య।

**క్రియ :** అగ్నౌకరణం చెయ్యగా మిగిలిన నేతిని విస్తరిపై అభిఘరించాలి. అగ్నివద్ద ఉన్న ఆకులోని నైర్‌ఋతి భాగములోని అన్నము కుడిచేతిలో తీసుకొని ఎడమచేతి మధ్య వేలును భోక్త విస్తరిమీద ఉంచి, దానిపై కుడిచేతిని పెడమరలుగా పట్టుకొని స్వధేయం । స్వధేయం । స్వధేయం । అంటూ ఆ అన్నాన్ని విస్తరిమధ్యలో ఉత్తరము నుండి దక్షిణ సమాప్తిగా మూడుచోట్ల ఉంచాలి.

(భోక్త) అస్తుస్వధా అని మూడుసార్లు 'స్వధేయం'కు ప్రతివచనం చెప్పాలి

సూ॥ పునరభిఘార్య ।

**క్రియ :** మళ్లీ మూడుచోట్ల ఆ అన్నము మీద నేయి వేయాలి.

సూ॥ పునః హస్తోదకం దత్వా ।

**క్రియ :** మరల కర్త హస్తోదకము తీసుకొని భోక్తకు ఇవ్వాలి.

మం॥ (కర్త) ఆస్వధేత్యా శ్రావయతి । (భోక్త) అస్తు స్వధేతి ప్రత్యాశ్రావ యతి

(కర్త) స్వధానమ ఇతి వషట్కరోతి । (భోక్త) స్వధాకారోహిపితౄణాం అనాలి.

**తూష్ణీం** (సవ్యం) విశ్వదేవస్థానే హస్తోదకం దత్వా ।

**క్రియ :** కర్త తను హస్తోదకము తీసుకొని విశ్వదేవస్థానములోని భోక్తకు ఇవ్వాలి.

సూ॥ భోజనపాత్రే అభిఘార్య । చరుపాత్రే అభిఘార్య.

**క్రియ :** విస్తరిలో నెయ్యి వేయవలె. అన్నం గిన్నెలోకూడా అభిఘరించాలి.

సూ॥ పునః హస్తోదకం దత్వా ।

**క్రియ :** గిన్నెతో అన్నం తెచ్చి మళ్లీ ఇందాకటిలాగే హస్తోదకం ఇవ్వాలి.

ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యాతిథౌ (ప్రాచీనావీతి) యజమానస్య (అస్మత్) పితుః (మాతుః) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే రాక్షసాఘ్నాన్ వైష్ణవాన్ పైతృకాన్ అన్నశుద్ధ్యర్థం ఆఘ్రాణదోష నిర్హరణార్థం అన్నసూక్త మంత్ర పఠనం (సవ్యం) (కర్త) కరిష్యే ।

**క్రియ :** పళ్లెములో నీళ్లు వదలాలి. (భోక్తలు కురుష్వ అనాలి.

సూ॥ మహాజనైస్సహ (కర్త) అశ్రావయిష్యే । (భోక్తలు) ఆశ్రావయ

**క్రియ :** కుడిచేతితో అన్నం గిన్నెపైన తాకుతూ కుడిచేతిపైన ఎడమచేతిని ఆనించి కింది మంత్రము మూడుసార్లు అనాలి.

మం. నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః । పృథివ్యై నమః ఓషధీభ్యః । నమోవాచే నమో వాచస్పతయే నమోవిష్ణవే బృహతే కరోమి । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సహవైదే వానాం ... శాన్తిః । అన్న సూక్తం జపిత్వా ।

**గమనిక :** ఈ అన్నసూక్తం ఆబ్దికంలోనేగాని తక్కిన శ్రాద్ధాలలో ఉండదు (స్మృత్యంతరే) **దీని పూర్తి పాఠం అనుబంధంలో చూడండి.**

**క్రియ :** కొంచెం అన్నం కర్త చేతిలోకి తీసుకుని ముందు విశ్వేదేవస్థానం విస్తరిలో ఉంచి తరువాత మరికొంచెం తీసుకుని పితృస్థానం విస్తరిలోను ఉంచాలి. ఇప్పుడు వడ్డన ప్రారంభించాలి.

# వడ్డన

కర్త వడ్డన చెయ్యటం ఉత్తమము. కుదరకపోతే కర్త భార్య లేదా మరొకరు స్నానం చేసి వడ్డించాలి. వడ్డనకు స్టీలు పాత్రలు వాడకూడదు. కర్త అయితే పవిత్రం తీసేయ్యాలి. స్త్రీలు వడ్డించేటప్పుడు ఎర్ర అంచు కాని వస్త్రాలు ధరించాలి.

మొదట వడ్డన విశ్వేదేవస్థానములో తరువాత పితృ (మాతృ) స్థానములో చేయాలి. సువాసినుల ఆబ్దికం అయితే ఒక ముత్తైదువను కూర్చోబెట్టి విస్తరివేసి ఆ విస్తరిలో భోక్తలతో పాటు వడ్డించాలి. ఇది ఆచారము మాత్రమే. మొదట అన్నము భోక్తకు విస్తరిమధ్యలో అన్నము, ముందు భాగమున పప్పు, పరమాన్నం, కుడివైపున కూరలు, ఎడమవైపున పచ్చళ్ళు, తూర్పుభాగమున అనగా చివరిలో భక్ష్యాలు వడ్డించాలి. వడ్డనకు మొదట అన్నము, తరువాత పరమాన్నం, తరువాత భక్షములు, నెయ్యి (దొన్నెలో) తరువాత కూరలు, పచ్చళ్ళు, వగైరాలు ఇదీ వడ్డన చేసే క్రమం. పదార్థాలు ఒకదానికొకటి తాకకుండా వడ్డించాలి. భక్ష్యములు చేతితోను పచ్చళ్లు దొప్పలా చేసిన ఆకుతోను తక్కిన పదార్థాలు లవణంతో సహా గరిటతోను వడ్డించాలి. రెండు విస్తరులలోను సమానంగా వడ్డించాలి. ఒక పదార్థాన్ని రెండు (మూడు) విస్తళ్లలో వడ్డించిన తరువాతనే మరొక దాన్ని వడ్డనకు తేవాలి. నేతిదొన్నెలను విస్తళ్ల సమీపంలో కుడిపక్కన పెట్టాలి. పెరుగు, లవణం, పళ్లు వీటితో సహా వంటకాలన్నీ వడ్డించాలి. భోజనం మధ్యలో కొత్త పదార్థాలు వడ్డించకూడదు. ఈ వడ్డన సమయంలోనే పార్వణం నిమిత్తం, అగ్నౌకరణానికి వాడిన విస్తరిలో, గారెలు మినహా మిగతా పదార్థాలన్నీ భోక్తలతోపాటు వడ్డించాలి పిండ పరిమాణానికి తగినంత అన్నము, కొంచెం కొంచెంగా మిగిలినవి వడ్డించాలి (శ్రాద్ధసాగరం) ఇంతకుముందే కర్త వాయవ్యభాగంలోని అన్నాన్ని దొన్నెలోకి తియ్యాలి. భోజన సమయంలో ప్రతి పదార్థాన్నీ భోక్తలవద్దకు తెచ్చి మారు అడగాలి తేకుండా అది కావాలా ఇది కావాలా అని అడగకూడదు. ఉప్పు మారు అడగకూడదు కాబట్టి ముందుగానే తగినంత వడ్డించాలి. మొదటి వడ్డన పూర్తి కాగానే అన్నం, పప్పు, పరమాన్నం, భక్ష్యాలు వీటన్నిటిమీద అభిఘరించాలి. భోక్తలు పెరుగు కలుపుకున్నప్పుడు మళ్లీ విస్తళ్ళలో అన్నం తీసుకొని వచ్చి మారు అడగాలి.

## పరివేషచనవిధి

మం. ఓం భూర్భువస్సువః । ... ప్రచోదయాత్ (2 సార్లు)

**క్రియ :** గాయత్రీ మంత్రంతో నీళ్లు రెండు విస్తళ్లపై వేరువేరుగా చల్లాలి.

సూ॥ విశ్వేదేవస్థానే హస్తోదకందత్వా ।

మం॥ దేవసవితఃప్రసువ

**క్రియ :** కర్త హస్తోదకము తీసుకొని భోక్తకు ఇవ్వాలి. కుడిచేతిలో అక్షతలు, దర్భ తీసుకుని అమంత్రకంగా చేత్తో భోక్త కుడిచేతిని బొటనవేలు వదలి పట్టుకొని. కూర్చతో సవ్యంగా విస్తరిచుట్టూ పరిషించాలి. (నీరు చుట్టూ త్రిప్పవలె) కర్త, భోక్త తమ ఎడమ మధ్యవ్రేళ్లను తమవైపు విస్తరి అంచున ఆన్చవలె.

మం. పృథివీతే పాత్రంద్యౌరపిధానం బ్రహ్మణస్త్వాముఖేజుహోమి । బ్రాహ్మణానాంత్వా ప్రాణాపానయోర్జుహో మ్యక్షితమసి మైషాంక్షేష్ఠా అముత్రాముష్మిన్లోకే । ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదధేపదం । సమూఢమస్యపాగ్ంసురే స్వాహా । (విశ్వేదేవ హస్త మంగుష్ఠరహితం గృహీత్వా) శ్రీ విష్ణోహవ్యం రక్షస్వ । పురూరవార్ద్రవ సంజ్ఞికా విశ్వేదేవా ఏతత్ వో హవ్యం సపరికరం విశ్వేదేవాదేవతేదమన్నం

**క్రియ :** భోక్తచేతిని అన్నానికి దగ్గరగా తీసుకెళ్లాలి.

హవ్యం బ్రాహ్మణస్త్వాహవనీయార్థే దత్తం దాస్యమానం చ అతృప్తేస్తత్సర్వంగ-మేయం భూర్గదాధరోభోక్తా అన్నం బ్రహ్మ । అహంచబ్రహ్మ । భోక్తాచబ్రహ్మ । సౌవర్ణమయమిదం పాత్రం అక్షయవటచ్ఛాయేయం । పురూరవార్ద్రవ సంజ్ఞికేభ్యో విశ్వేభ్యో దేవేభ్యః ఇదమిదమన్నం అమృతస్వర[illegible] అతృప్తేర్[illegible] క్షయ తృప్త్యర్థం యథాభాగం హవ్యంతత్సత్ । (కర్త[illegible] [illegible]హో [illegible]

**క్రియ :** భోక్త యొక్క కుడిబొటనవేలు చేత అన్నం తాకించి అన్నంమీద ప్రదక్షిణంగా తిప్పాలి. అనంతరం కుడిచేతిలోని, దర్భలను యవలను నీటితో విస్తరి ఎడమవైపున వదలాలి.

సూ॥ (కర్త) గయాయాం శ్రీ విష్ణుపాదాది సమస్తతీర్థేషు దత్తమస్త్వితి భవన్తోబ్రువంతు । (భోక్త) గయాయాందత్తం అస్తు

మం. యేదేవాదివ్యేకా దశస్థపృథివ్యా మధ్యేకాదశస్థాప్సుషదో మహినైకా దశస్థతే దేవాయజ్ఞ మిమంజుషధ్వం ॥ విశ్వేదేవాస్తుష్టావరదాభవంతు । (భోక్త) వరదాభవామ ॥

**క్రియ :** కర్త హస్తోదకము తీసుకొని భోక్తకు ఇవ్వాలి. కూర్చతో అపసవ్యంగా విస్తరిచుట్టూ పరిషించాలి ఎడమచేయి కుడిచేతిమీదుగా పోనియ్యాలి. కర్త, భోక్త తమ ఎడమ మధ్య వ్రేళ్లను తమవైపు విస్తరి అంచుకు తాకించాలి.

సూ॥ ప్రాచీనావీతీ । పితృస్థానే హస్తోదకం దత్వా । అప్రదక్షిణం ప్రసువ ।

మం. పృథివీతే పాత్రంద్యౌరపిధానం బ్రహ్మణస్త్వాముఖే జుహోమి । బ్రాహ్మణానాంత్వా ప్రాణాపాన యోర్జుహో మ్యక్షితమసి మైషాంక్షేష్ఠా అముత్రాముష్మిన్లోకే । ఇదం విష్ణుర్విచక్రమే త్రేధాని దధేపదం । సమూఢమస్యపాగ్ంసురే । స్వధా । శ్రీ విష్ణోకవ్యం రక్షస్వ ।

సూ॥ పితృ (మాతృ) స్థానే భోక్తృ హస్త మంగుష్ఠరహితం గృహీత్వా

**క్రియ :** కుడిచేతిలో నువ్వులు, దర్భ తీసుకొని ఆ చేతితో భోక్త కుడిచేతిని బొటనవేలు వదిలి పట్టుకోవాలి. నువ్వులు విస్తరిలోకి జారకుండా జాగ్రత్త పడాలి.

సూ॥ యజమానస్య (అస్మత్) పితృ పితామహ ప్రపితామహాః ..... గోత్రాః .... శర్మణః ..... (మాతృపితామహి ప్రపితామహ్యాః .... గోత్రాః ....దాయ్యః ....) వసురుద్రాదిత్య రూపాః ఏతద్వః కవ్యం సపరికరం చ పితృపితామహ ప్రపితా మహాః ....గోత్రాః .... శర్మణః .... (మాతృ పితామహీ ప్రపితామహ్యాః .... గోత్రాః

.... దాయ్యః ....) రూపాదేవాదేవతేదమన్నం కవ్యం బ్రాహ్మణస్స్వాహవ నీయార్ధేదత్తం దాస్యమానం చాతృప్తేస్తత్సర్వంగయేయం భూర్గదాధరోభోక్తా అన్నం బ్రహ్మ। అహం చ బ్రహ్మ భోక్తా చ బ్రహ్మ। రాజతమయమిదం పాత్రం అక్షయా వట ఛ్ఛాయేయం పితృపితామహ ప్రపితా మహేభ్యః .... గోత్రేభ్యః .... శర్మభ్యః .... వసురుద్రాదిత్య రూపేభ్యః (మాతృ పితా మహీ ప్రపితా మహీభ్య ..... గోత్రాభ్యః .... దాయీభ్యః .... వసురుద్రాదిత్య రూపాభ్యః) ఇదమిదమన్నం

**క్రియ :** భోక్తచేతిని అన్నానికి దగ్గరగా తీసుకురావాలి.

సూ॥ అమృతస్వరూపం ఆతృప్తేర్దాస్యమానం అక్షయ తృప్త్యర్థం యథాభాగం కవ్యంతత్సత్ । స్వధా స్వధా నమమ నమమ ।

**క్రియ :** భోక్త కుడి బొటనవేలిని, గోరు తగలకుండా, అన్నానికి తాకించి అన్నంమీద అప్రదక్షిణంగా తిప్పాలి. అనంతరం నువ్వులు, దర్భ నీళ్లతో విస్తరి కుడివైపున వదలాలి.

సూ॥ (కర్త) గయాయాం శ్రీ విష్ణుపాదాది సమస్త తీర్థేషు దత్తమస్త్వితి భవంతో బ్రువంతు । (భోక్త) గయాయాం దత్తమస్తు అనాలి.

మం. (సవ్యం) యేచేహపితరోయేచనే హయాగ్శ్చవిద్మయాగ్ ఉచనప్రవిద్మ। అగ్నేత్వం వేత్థయదితే జాతవేదః । స్వధాభిర్యజ్ఞగ్ం సుకృతం జుషస్వ

**క్రియ :** నమస్కారం చెయ్యాలి.

మంత్ర, తంత్ర, స్వర, వర్ణ, లోప ప్రాయశ్చిత్తార్థం యథాశక్తి మహా గాయత్రీ మంత్రజపం కరిష్యే –

**క్రియ :** కర్త నీళ్లు పళ్లెములో వదిలి అనంతరం ఉత్తరముఖుడై కూర్చుని పదిసార్లు గాయత్రీ మంత్రం జపించాలి.

శ్లో॥ సప్తవ్యాధాదశార్ణేషుమృగాః కాలాంజ నేగిరౌ
చక్రవాకాశ్శర ద్వీపేహంసాస్సరసిమాన

యేస్మజాతాః కురుక్షేత్రే బ్రాహ్మణావేద పారగాః ।
ప్రస్థితా దీర్ఘమధ్వానంయూయం తేభ్యోవసీదత ॥

అమూర్తానాంచమూర్తానాం పితౄణాం దీప్తతేజసాం ।
నమస్యామిసదాతేషాం ధ్యాయినాంయోగచక్షుషాం ॥

చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాంపంచభిరేవచ ।
హూయతేచపునర్ద్వాభ్యాం సమే విష్ణుః ప్రసీదతు ॥

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం ।
బ్రహ్మైవతేనగంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

యజ్ఞేశ్వరోహవ్యసమస్తకవ్య భోక్తావ్యయాత్మాహరిరీశ్వరోత్ర ।
తత్సన్నిధానాదపయాంతు సద్యో రక్షాంస్య శేషాణ్య సురాశ్చసర్వే ॥

త్వాం యోగినశ్చింతయంతిత్వాంయజంతిచ యజ్వనః ।
హవ్య కవ్య భుగేకస్త్వం పితృ దేవ స్వరూపధృత్ ॥

కర్తా క్రియాణాంసస ఇజ్యతే క్రతుస్సఏవ తత్కర్మఫలంచయచ్చ ।
స్రుగాదియత్సాధనమప్యశేషం హరేర్న కించిద్వ్యతి రిక్తమస్తి ॥

గయాయాం ధర్మపృష్ఠేచ సదసిబ్రహ్మణస్పతే ।
గయాశీర్షేవటేచైవ పితౄణాం దత్తమక్షయమ్ ॥

సూ॥ (కర్త) దేశ, కాల, పాత్ర, మంత్ర, తంత్ర, కర్తృ, భోక్తృ, స్థల, హవి, ద్రవ్యాదిభ్యః సర్వం న్యూనాతి రిక్తాభ్యాంకర్మణ్యచ్ఛిద్రమస్త్వితి భవంతో బ్రువంతు । (భోక్తలు) సర్వం న్యూనాతి రిక్తాభ్యాంకర్మణ్యచ్ఛిద్రమస్తు

**క్రియ :** కర్త అక్షతలు, నీళ్లు వదలాలి.

సూ॥ (సవ్యం) ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ (ప్రాచీనావీతి) యజమానస్య (అస్మత్) పితుః (మాతుః) ప్రతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే పితృ పితామహ ప్రపితామహాన్ .... గోత్రాన్ .... శర్మణః వసురుద్రాదిత్యరూపాన్ (మాతృ పితామహీప్రపితా మహీః గోత్రాః .... దాయీః

.... వసురుద్రాదిత్యరూపాః) (సవ్యం) పురూరవార్ద్రవ సంజ్ఞికాన్ విశ్వాన్ దేవానుద్దిశ్య అనేనమయాక్రియమాణేన। (ప్రాచీనావీతీ) యజమానస్య (అస్మత్) పితుః (మాతుః ) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధేన పితృ పితామహ ప్రపితామహానాం .... గోత్రాణాం ... శర్మణాం (మాతృ పితామహి ప్రపితా మహీనాం .... గోత్రాణాం .... దాయినాం....) వసురుద్రాదిత్యరూపాణాం ఏతేషాం (ఏతాసాం) ఏతచ్ఛ్రాద్ధం గయాన్న శ్రాద్ధేనైవ అక్షయాతృప్తి ర్భూత్వా। పితుః (మాతుః) పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోకే నిత్య నివాససిద్ధిరస్త్వితి భవంతో బ్రువంతు ॥ (భోక్తలు) యజమానస్య పితౄణాం పునరావృత్తి రహిత శాశ్వతబ్రహ్మలోకే నిత్య నివాస సిద్ధిరస్తు । సర్వంసగుణమస్తు। గయాశ్రాద్ధ ఫలితమస్తు ।

**క్రియ :** తిలలు, దర్భలు నీటితో పళ్లెములో వదలవలె.

శ్లో॥ ఈశానవిష్ణు కమలాసన కార్తికేయ వహ్నిత్రయార్క రజనీశ గణేశ్వరాణాం । సభ్యావ సథ్య దధికణ్వ మతంగజానాం క్రౌంచామరేంద్ర కలశోద్భవ కశ్యపానాం పాదాన్నమామి సతతం పితృ ముక్తి హేతూన్ । (నివీతి) గయేయం గయేయం, గయేయం। దర్భ తీసుకొని జంధ్యము తావళముగా (మెడలో దండగా) వేసుకొని ఉత్తరముఖముగా నిలబడి పితృ (మాతృ) రూపమును మనసులో తలచుకొని ఆ దర్భను ఉత్తర దిక్కుగా పడవైచి నమస్కరించాలి.

సూ॥ యథాకాల దత్తమస్తు ॥ (సవ్యం)

**క్రియ :** అక్షతలు, దర్భలు నీటితో పళ్లెములో వదలాలి. భోక్తలకు నమస్కరించాలి.

మం. నమోదేవేభ్యః। (విశ్వేదేవులకు) స్వధాపితృభ్యః। (పితృదేవతలకు) నమోవిష్ణవే।

ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః। ఓం తదాత్మా। ఓం తథ్సత్యం। ఓం తథ్సర్వం। ఓం తత్పురోర్నమః। అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు। త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వమింద్రస్త్వగ్ంరుద్రస్త్వం విష [illegible] బ్రహ్మత్వం [illegible] త్వంతదాప ఆపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భు [illegible] ం। [illegible]

శ్రద్ధాయాం ప్రాణేనివిష్టోమృతం జుహోమి । శ్రద్ధాయామపానేని విష్టోమృతం జుహోమి । శ్రద్ధాయాం వ్యానేనివిష్టోమృతం జుహోమి । శ్రద్ధాయాముదా నేనివిష్టో మృతం జుహోమి । శ్రద్ధాయాగ్ం సమానేని విష్టోమృతంజుహోమి । బ్రహ్మణిమ ఆత్మామృతత్వాయ ।

మధువాతాఋుతాయతే మధుక్షరంతి సింధవః । మాధ్వీర్నస్సంత్వోషధీః ॥ మధునక్తముతోషసి । మధుమ త్పార్థివగ్ంరజః । మధుద్యౌరస్తునఃపితా । మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ంఅస్తుసూర్యః । మాధ్వీ ర్గావో భవంతునః ॥ అక్షన్న మీమదం తహ్యావ ప్రియాఅధూషత । అస్తోషతస్వభానవో విప్రానవిష్ఠయామతీ । యోజాన్వింద్రతేహరీ ॥ మయాకృతం శ్రాద్ధం సంపన్నం । సుసంపన్నం । సర్వంమధ్వస్తు అక్షన్నమీమదన్త = హరీ । మధు మధు మధు ॥

## భోక్తల భోజనము

సూ॥ యథాసుఖం పరిషేచనం । విశ్వేదేవస్థానే ఆపోశనం దత్వా ।

మం. ఓం భూర్భువస్సువః । ఓం తత్స వితుర్వరేణ్యం । భర్గోదేవస్యధీమహి । ధియోయోనః ప్రచోదయాత్

**క్రియ :** విశ్వేదేవస్థాన భోక్త కుడిచేతిలో ఉద్ధరణితో నీళ్లు ఒకసారి పోయాలి. భోక్త ఆ నీళ్లను విస్తరిలోని పదార్థాలమీద చల్లాలి.

సూ॥ సత్యంత్వర్తేన పరిషించామి । బొటన, చూపుడు, మధ్యవేళ్లతో చెంబు పట్టుకొని భోక్త చేతిలో తగినంత నీరు పోయాలి. భోక్త ఆ నీటిని విస్తరి చుట్టూ కుడివైపున ప్రారంభించి ప్రదక్షిణంగా విస్తరిచుట్టూ ఖాళీ లేకుండా నీళ్లు పొయ్యాలి.

మం. ఓం భూర్భువస్సువః । ఓం తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి ।

ధియోయోనః ప్రచోదయాత్

**క్రియ :** పితృస్థాన భోక్త చేతిలో ఇంతకుముందులాగే నీళ్లు పోయాలి. అతడు ఆ నీళ్లు విస్తరి మీద చల్లాలి.

సూ॥ సత్యంత్వర్తేన పరిషించామి

**క్రియ :** విశ్వేదేవస్థాన భోక్త చేతిలో పోసినట్లే పితృస్థానభోక్తకుడి చేతిలో నీరు పోయాలి. అతడు ఆ నీళ్లను విస్తరిచుట్టూ కుడివైపున ప్రారంభించి ప్రదక్షిణంగా ఖాళీ లేకుండా పొయ్యాలి.

సూ॥ (ప్రాచీనావీతి) హస్తోదకం దత్వా ।

**క్రియ :** కర్త తను హస్తోదకమును తీసుకుని భోక్తకివ్వాలి.

సూ॥ సవ్యం - విశ్వేదేవస్థానే హస్తోదకం దత్వా

**క్రియ :** కర్త హస్తోదకం తీసుకుని విశ్వేదేవ భోక్తకివ్వాలి.

పితృభ్యః (మాతృభ్యః) అమృతమస్తు ।

**క్రియ :** భోక్త కుడిచేతి బొటనవేలు చూపుడు, మధ్య వేళ్ల మధ్య నుంచి అరచేతిని దొప్పలాగ పట్టుకోవాలి. కర్త ఉద్ధరణితో మూడుసార్లు భోక్త చేతిలో నీళ్లు పోయాలి.

విశ్వేభ్యో దేవేభ్యః । అమృతమస్తు

**క్రియ :** విశ్వేదేవస్థాన భోక్త కూడా పైవిధంగా చేతిని పట్టాలి. కర్త రెండుసార్లు ఉద్ధరణితో నీళ్లు పొయ్యాలి.

మం. అమృతోపస్తరణమసి । ఇయం భూర్గయా ఏతే బ్రాహ్మణా గదాధరాః

అక్షయావటచ్ఛాయేయం పితృరూపీ (మాతృరూపీ) శ్రీజనార్దన వాసుదేవః

ప్రియతాం తత్సద్బ్రహ్మార్పణమస్తు ।

**క్రియ :** ఉద్ధరణితో నీరు పళ్లెములో వదలాలి. ఈ క్రింది 5 మంత్రములు చెప్తూతూ ఇద్దరు భోక్తలు 5 సార్లు ప్రాణాహుతులు తీసుకోవాలి. కుడిచేతి ఉంగరపు వేలికి అడ్డంగా దర్భ పెట్టుకుని, స్వాహా అన్న ప్రతిసారి మెతుకులను గ్రహించి నేతికి తాకించి పళ్లకు తగలకుండా రుచి తెలియని విధంగా నాలుక మధ్య భాగంపై ఉంచి మింగాలి. 1) బొటన, చూపుడు, మధ్యవేళ్లతో 2) బొటన, మధ్య, ఉంగరం వేళ్లతో 3) బొటన, ఉంగరపు, చిటికెనవేళ్లతో 4) బొటన, చూపుడు, చిటికెన వేళ్లతో 5) అయిదువేళ్లతో ప్రాణాహుతులు గ్రహించాలి. ప్రతి భోక్త తాను ఏ దిక్కుకి అభిముఖంగా ఉన్నాడో ఆ దిక్కున ప్రారంభించి ప్రదక్షిణ క్రమంలో నాలుగు దిక్కుల నుంచి నాలుగుసార్లు, ఐదవసారి మధ్య నుంచి మెతుకులు గ్రహించాలి.

మం. 1) శ్రద్ధాయాం ప్రాణేనివిష్టోమృతం జుహోమి ॥ శివోమావిశాప్రదాహాయ । ఓం ప్రాణాయ స్వాహా 2) శ్రద్ధాయా మపానేనివిష్టోమృతం జుహోమి। శివోమా-విశాప్రదాహాయ । ఓం అపానాయస్వాహా 3) శ్రద్ధాయాం వ్యానేనివిష్టోమృతం జుహోమి । శివోమావిశాప్రదాహాయ । ఓం వ్యానాయ స్వాహా । 4) శ్రద్ధాయా-ముదానేనివిష్టోమృతం జుహోమి । శివోమావిశాప్రదాహాయ । ఓం ఉదానాయ స్వాహా । శ్రద్ధాయాగ్ంసమానే నివిష్టోమృతం జుహోమి । శివోమావిశా-ప్రదాహాయ । ఓం సమానాయ స్వాహా । బ్రహ్మణిమఆత్మామృతత్వాయ ।

**క్రియ :** భోక్తలు ప్రాణాహుతులు తీసుకున్న తరువాత వారు ఎడమ హస్తములు విస్తరి కుడివైపున చూపించగా కర్త ఆ చేతులపై నీళ్లు పోయాలి. (చేతుల శుద్ధికోసం) ముత్తైదువ కాళ్లకు కర్త భార్యగాని, మరొకరుగాని పసుపు రాసి గంధం ఇచ్చి, బొట్టు పెట్టి నూతన వస్త్రాలు అద్దం గాజులు, కాటుక వగైరాలు ఇవ్వాలి. భోక్తలతోపాటు ఆమెకూడా భుజించాలి.

సూ॥ గాయత్రీం త్రివారం జపేత్ । గాయత్రీ మంత్రము కర్త మూడుసార్లు చెప్పాలి.

మం. మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః । మాధ్వీర్నస్సంత్వోషధీః ।
మధునక్తము తోషసి మధు మత్పార్థివగ్ంరజః । మధుద్యౌరస్తునః పితా ।
మధుమాన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తుసూర్యః । మాధ్వీర్గావోభవంతునః ।
మధు - మధు - మధు । (భోక్తలు) సర్వంమధ్వస్తు

**క్రియ :** విస్తళ్ళలోని భక్ష్యముల మీద తేనె వేయాలి. తేనె లేకపోతే మంత్రంతో సరిపెట్టాలి గాని బెల్లం వంటి ప్రత్యామ్నాయాలు వేయకూడదు

శ్లో॥ కలౌకలికృతాన్‌దోషాన్ ద్రవ్యదేహోత్మ సంభవాన్ ।
సర్వాన్‌హరతిచిత్తస్థో భగవాన్ దేవకీసుతః ॥

శ్లో॥ మంత్ర మధ్యే క్రియామధ్యే విష్ణోస్స్మరణపూర్వకం ।
యత్కించిత్క్రియతే కర్మ తత్కర్మ సఫలం భవేత్ ।

శ్లో॥ అపేక్షితం యాచితవ్యంత్యాజ్యంచైవా నపేక్షితం
ఉపవిశ్య సుఖేనైవ భోక్తవ్యం స్వస్థమానసైః ।
విద్యమాన పదార్థేషు
యద్రోచతే తద్గ్రాహ్యం యన్నరోచతే తత్‌త్యాజ్యం సుఖేన మౌనేన భోక్తవ్యం ।

మం. యదశ్వస్య క్రవిషో మక్షికాశయద్వాస్వరౌ స్వధితౌరిప్త మస్తి । యద్ధస్తయోశ్శ-
మితుర్యన్నఖేషు సర్వా తాతే అపిదేవేష్వస్తు । మక్షికాబాధా నివృతిరస్తు ।
గయాశ్రాద్ధ ఫలితమస్తు

**క్రియ :** భోక్తలను ఇష్టమైన పదార్థములను గ్రహించి, ఇష్టములేని పదార్థములను వదలి, సుఖముగా మెల్లగా భోజనము చేయమని ప్రార్థించాలి. మంచి బ్రాహ్మణులు దొరికారని ప్రశంసించాలి. భోక్తలు మౌనంగా భుజించాలి. ముఖ్యంగా వంట బాగోగులు గురించి మాట్లాడకూడదు. కర్తకూడా ఆ ప్రసక్తి తేకూడదు. మారువడ్డనలో సైగలతో కావాలనో వద్దనో సూచించాలి. ఎడంచేత్తో అన్నం ముట్టుకోకూడదు. పాదం విస్తరికి తగలకూడదు. మొదట వడ్డి [illegible] ర్థాలు [illegible] దేనినీ

అడగకూడదు. భోజనం చేసేటప్పుడు గొంతుక కూర్చుండకూడదు. చంకలు కనపడేటట్లు చేతులు ఎత్తకూడదు. బొటనవేలు విడిచి నాలుగు వేళ్లతో తినకూడదు. భక్ష్యములు, పళ్లు సగం కొరికి విస్తరిలో ఉంచి మళ్లీ తినకూడదు. విస్తరిలో ఉమ్మకూడదు. వేడి పదార్థములను ఊదుకుని తినకూడదు. మంచినీళ్లు తాగిన ప్రతిసారీ పెద్ద చెంబులోనుంచి చిన్నగ్లాసులోకి కావలసినంత తీసుకుని మిగలకుండా తాగాలి. భోక్తలు ఆచమనం, ఆపోశనం తీసుకునేటప్పుడుగాని, పెరుగు, పరమాన్నం తినేటప్పుడుగాని చప్పుడు కాకూడదు. విస్తరిలో కొంచెం శేషం వదలాలి. అయితే నెయ్యి, పెరుగు, పరమాన్నం మాత్రం వదలకూడదు. భోజనానికి ముందు వేలికున్న దర్భను విస్తరిపక్క జాగ్రత్తగా ఉంచాలి. తిరిగి భోజనం అయ్యాక ఉత్తరాపోశనానికి ముందు మళ్లీ ధరించాలి.

**గమనిక :** భోక్తకు నిత్యం భోజనానికి ముందు బలిదానం చేసే అలవాటుంటే ఆబ్దికంనాడు చెయ్యకూడదు. చేస్తే రౌరవాది నరకాలు ప్రాప్తిస్తాయి.

**అధిశ్రవణము :**

సూ॥ తతః బ్రాహ్మణ భోజనకాలే రాక్షసబాధానిర్హరణార్థం అధిశ్రవణ మంత్ర పఠనం (సవ్యం) కరిష్యే । పళ్లెములో నీళ్లు వదలాలి.

సూ॥ (కర్త) మహాజనైస్సహ ఆశ్రావయిష్యే । (భోక్తలు) ఆశ్రావయ అనాలి.

**గమనిక :** ఇక్కడ చెప్పవలసిన (వేదంలోని) త్రిసుపర్ణాలు, పితృరధ్యాయములు అనుబంధములో చూడండి. ఈ అధిశ్రవణాన్ని మాసికాలు, సంవత్సర విమోకం, ప్రథమాబ్దికం ఈ సందర్భాలలో చెప్పకూడదు. (ధర్మప్రవృత్తి)

## భోక్తల భోజనానంతరం

మం. గాయత్రీ మంత్రం ఆ పైన మధువాతాఋతాయతే మధుక్షరంతిసింధవః

మాధ్వీర్నస్సంత్వో షధీః । మధునక్తము తోషసిమధుమత్పార్థివగ్‍రజః ।

మధుద్యౌరస్తునః పితా । మధుమాన్నో వనస్పతి ర్మధు మాగ్ం అస్తుసూర్యః ।

మాధ్వీర్గావోభవంతునః । మధు - మధు - మధు । సర్వం మధ్వస్తు

సూ॥ (కర్త) మయాకృతం శ్రాద్ధం సంపన్నం (భోక్తలు) సుసంపన్నం

సూ॥ (ప్రాచీనావీతి) పితృపితామహ ప్రపితామహాః । (మాతృపితామహీ ప్రపితామహ్యాః ।) (కర్త పితృస్థాన భోక్తతో) తృప్తాస్థ । తృప్తాస్థ । (భోక్త) తృప్తాస్మః

శ్లో॥ అసంస్కృత ప్రమీతాయే త్యాగిన్యోయాః కులస్త్రియః ।
దాస్యామితేభ్యో వికిరమన్నం తాభ్యశ్చ పైతృకమ్ । పరిషిచ్య

సూ॥ అప్రదక్షిణం పరిషిచ్య

**క్రియ :** అగ్నిహోత్రము వద్ద నున్న ఆకులోని వాయవ్య భాగములోని అన్నంలో కొంత ఒక దొన్నెలోకి తీసుకొని ఆ అన్నం మీద కొద్దిగా నీళ్లు పోసి పితృ (మాతృ) స్థానములోని భోక్త విస్తరి కుడిప్రక్కగా కొంచెము దూరములో నేలపై కూర్చ తాకించి ఆ దొన్నెలోని కొంత అన్నము పెడమరలుగా నేలమీద ఉంచి, (విస్తరికి తగలకుండగ) విస్తరికి ప్రక్కగా నుండి ఆ ఉంచిన అన్నానికి కలుపుతూ మరి కొన్ని మెతుకులు పెడమరలుగా పశ్చిమం నుంచి తూర్పుకు వేయాలి. తర్వాత అప్రదక్షిణంగా ఆ అన్నంచుట్టు కూర్చతో త్రిప్పాలి.

సూ॥ (సవ్యం) పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః॥ (కర్త) తృప్తాస్థ । తృప్తాస్థ॥ (భోక్త) తృప్తాస్మః

**క్రియ :** విశ్వేదేవస్థాన విస్తరికి ఎడంప్రక్కన నేలకు కూర్చ తాకించి దొన్నెలో మిగిలిన అన్నమును విశ్వదేవస్థానములోని భోక్త విస్తరి ఎడమప్రక్కన కొంచెంనేలమీద వుంచి అచటనుండి కొంచెము వరకు ఆ దొన్నెలోని మిగతా అన్నమును నేలమీద దక్షిణం నుంచి ఉత్తరానికి వేసి ఆ దొన్నెను బోర్లించవలె.

శ్లో॥ అసోమపాశ్చయేదేవాః యజ్ఞ భాగ వివర్జితాః ।
తేషామన్నం ప్రదాస్యామి వికిరం వైశ్వదైవికం । పరిషిచ్య ।

**క్రియ :** సవ్యంగా కూర్చతో ఆ అన్నము చుట్టూ త్రిప్పవలె.

సూ॥ (ప్రాచీనావీతీ) దేవపితృ (మాతృ) మధ్యే ప్రోక్ష్య । దక్షిణాగ్రాన్ దర్భానాస్తీర్య॥ తేషు తిలోదకం నినీయ ।

**క్రియ :** దేవ, పితృ (మాతృ) స్థానాల మధ్యగా విస్తళ్లకు ఆరంగుళాల దూరంలో నీరు చల్లి దక్షిణదిక్కుగా అగ్రములు (కొసలు) ఉండునట్లుగా దర్భలు ఉంచి, వాటిపై తిలలు, నీరు పెడమరలుగా వదలాలి. అగ్ని హోత్రం వద్ద ఉన్న ఆకులో వాయవ్యభాగంలో మిగిలిన అన్నానికి నువ్వులు అవసరమైతే వేరే అన్నం కలిపి కోలగా చిన్నముద్ద చెయ్యాలి. దీన్నే వికిరపిండం అంటారు.

మం. యే అగ్నిదగ్ధా యేనగ్ని దగ్ధాః । యేవాజాతాఃకులేమమ । భూమౌదత్తేన పిండేన తృప్తాయాంతు పరాం గతిమ్ । అగ్నిదగ్ధేభ్యః అనగ్నిదగ్ధేభ్యః అస్మత్ కుల ప్రసూతమృతేభ్యః । ఏషపిండః ఉపతిష్ఠతు ।

**క్రియ :** కుడికాలు మడిచి వికిర పిండమును పెడమరలుగా ఆ దర్భలపై ఉంచాలి.

సూ॥ అగ్నిదగ్ధాశ్చ । అనగ్నిదగ్ధాశ్చ । మార్జయంతామ్ । ఏత ద్వస్తిలోదకం । వికిరం దత్వా ।

**క్రియ :** పిండము పడమటి వైపు పెడమరలుగా తిలలు, నీరు వదలాలి. ఈ వికిర పిండమును తనకులంలో ఉపనయనానికి ముందు చనిపోయిన వారికి, సన్యసించి మృతి చెందినవారికి తన ఇంట్లో పరిచర్యలు చేసి చనిపోయిన వారికి తృప్తి కలిగించడానికి ఉద్దేశించబడింది. (వెం.సో) వికిర పిండాన్ని భోక్తల విస్తళ్లు తీసే ముందు వాయస పిండముగా ఉంచడం ఆచారంగా ఉంది కాని వికిరపిండాన్ని గోతిలో పూడ్చవలెనని ధర్మప్రవృత్తిలో ఉంది.

(సవ్యం) తూష్ణీం పాదౌ ప్రక్షాళ్య । ఆచమ్య పూర్వపవిత్రం విసృజ్య । పునః పవిత్రం ధృత్వా ।

**క్రియ :** సవ్యముగా కర్త పాదములు కడుగుకొని (తుడుచుకుని) ఆచమనం చేసి పవిత్రం విడిచి నూతన పవిత్రం ధరించాలి.

**భోక్తలకు ఉత్తరాపోశనము :**

(కర్త) ఆచమ్య .... ఓం శ్రీకృష్ణాయ నమః

సూ॥ శేషముచ్ఛిష్ట భాగ్భ్యోన్నందీయతాం

**క్రియ :** భోక్తలు తాము భుజించగా ఉన్న అన్న శేషం నేలమీదకు కొంచెం తోసి క్రింది శ్లోకము చెప్పాలి.

**శ్లో॥** యజమానకులేజాతా దాసాదాస్యోన్నకాంక్షిణః ।

తే సర్వే తృప్తి మాయాంతు మయాదత్తేన భూతలే ।

మం॥ (కర్త) అమృతాపిధానమసి ।

**క్రియ :** భోక్తలు భోజనం ముందు విస్తరి పక్క ఉంచిన దర్భలను వారి ఉంగరపువేళ్లకు తిరిగి ధరించి చెయ్యి పట్టాలి. కర్త సవ్యముగా మొదట పితృస్థాన భోక్తకు తరువాత విశ్వేదేవ స్థానభోక్తకు ఉత్తరాపోశనము (అనగా చేతిలో నీరు) చెంబుతో తగినంత పొయ్యాలి.

మం. ఓం శ్రద్ధాయాం ప్రాణేని విశ్యా మృతగ్ం హుతం । ప్రాణమన్నే నాప్యాయస్వ।

ఓం శ్రద్ధాయా మపానేనివిశ్యా మృతగ్ం హుతం । అపానమన్నేనాప్యాయస్వ।

ఓం శ్రద్ధాయాంవ్యానేనివిశ్యా మృతగ్ం హుతం । వ్యానమన్నే నాప్యాయస్వ ।

ఓం శ్రద్ధాయాముదా నేనివిశ్యా మృతగ్ం హుతం । ఉదాన మన్నే నాప్యాయస్వ।

ఓం శ్రద్ధాయాగ్ం సమానేనివిశ్యా మృతగ్ం హుతం । సమాన మన్నే నాప్యాయస్వ । అంగుష్ఠమాత్రః పురుషోంగుష్ఠంచ సమాశ్రితః । ఈశస్సర్వస్య-జగతః ప్రభుః ప్రీణాతి విశ్వభుక్ ।

మం. రౌరవే ఽ పుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం ।

అర్థినా ముదకందత్తమక్షయ్యముపతిష్ఠతు ॥

సూ॥ భోక్తారః ఆచమ్య ।

**క్రియ :** భోక్తలు తమచేతిలో నున్న ఉదకమును కొంతలోనికి తీసుకొని మిగతా నీటిని తమ విస్తరికి ఎడమవైపున చూపుడువేలి [illegible] వదలా[illegible]

# పిండ ప్రదానము

ఈ కార్యక్రమం దక్షిణముఖుడై చెయ్యాలి.

సూ॥ ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ (ప్రాచీనావీతీ) యజమానస్య (అస్మత్) పితుః (మాతుః) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధీయ తిలోదక పిండప్రదానాని (సవ్యం) (కర్త) కరిష్యే ।

**క్రియ :** పళ్లెములో నీళ్ళు వదలవలె. భోక్తలు కురుష్వ అనవలె. భోక్తలు లేచి బైటకు చేతులు కడుగుకొని దర్భలు విసర్జించాలి.

సూ॥ పిండత్రయం కృత్వా ।

**క్రియ :** అగ్నికి దగ్గరగా ఉన్న విస్తరిలోని నాల్గవ భాగమన్నముతోపాటు పార్వణానికి వడ్డించిన అన్నము, గారెలు మినహా భక్ష్యములు ఇతర పదార్థములు నేయి కలిపి ఒలిచిన కొబ్బరికాయ పరిమాణంలో మూడు పిండములు చేయాలి. ఈ పిండాలను భోక్తల భోజన సమయంలో కర్త పవిత్రం తీసి చెయ్యడం, అనంతరం చెయ్యి కడుగుకొని పవిత్రం ధరించడం ఆచారంగా ఉంది. కొన్ని తెల్లమెతుకులు కొంచెం కలిపిన మిశ్రమం మిగిలేటట్లు చూసుకోవాలి.

సూ॥ పిండస్థానే గోమయేనానులిప్య ।

మం. ఓం అపాం మేధ్యం యజ్ఞియగ్ం సదేవగ్ంశివమస్తుమే । ఆచ్ఛేత్తావోమారిషం జీవానిశరదశ్శతమ్ । ఆచ్ఛినత్తి ।

సూ॥ అప ఉపస్పృశ్య ।

మం. అపహతా అసురారక్షాగ్ం సిపిశాచావేదిషదః ।

సూ॥ వేదిముల్లిఖ్యతూష్ణీం ప్రఘృష్య ।

**క్రియ :** పిండములుంచిన విస్తరికి దగ్గరగాను, భోక్తలవిస్తళ్లకు కనీసం మూరెడు దూరంగానుఉన్న స్థలంలో ఉత్తర, దక్షిణ దిశలుగా నీళ్లు చల్లి నిలువుగా గోమయముతో గాని, పసుపుతోగాని అలకాలి. చేతులు కడుగుకోవాలి. అలికిన చోటున దర్భ

మొదలు పట్టుకుని దర్భతో ఉత్తరం నుంచి దక్షిణానికి మూడు చోట్ల విడివిడిగా తప్పినట్లు తాకాలి.

మం. (ప్రాచీనావీతి) శుంధంతాం పితరః। శుంధం తాంపితా మహాః। శుంధంతాం ప్రపితామహాః । (శుంధంతాం మాతరః । శుంధంతాం పితామహ్యాః । శుంధంతాంప్రపితామహ్యాః ।

**క్రియ :** దర్భకొసలు పట్టుకొని, అలికిన చోటు మీద మూడు చోట్ల (ఉత్తరమున మొదలుపెట్టి దక్షిణమునకు) పెడమరలుగా నీరు వదలాలి.

మం. ఆయంతు పితరో మనోజవసః। అభిమంత్ర్య। సకృదాచ్ఛిన్నం బర్హిరూర్ణామృదు- స్యోనం - పితృభ్యస్త్వా భరామ్యహమ్ । అస్మిన్సీదంతుమేపితర స్సోమ్యా పితామహాః । ప్రపితా మహాశ్చానుగైస్సహ ।

సూ॥ దక్షిణాగ్రాన్ దర్భానాస్తీర్య ।

**క్రియ :** దక్షిణాగ్రాలుగా దర్భలను అలికినచోటు మీద ఒకేసారి పరవాలి. ఈ దర్భలు 21 అంగుళాలు పొడవుండాలి. ఆబ్దికానికి 7 మాసికాదులకు 11 దర్భలు వాడాలి.

మం. మార్జయంతాం పితరః వసురూపాః। మార్జయంతాంపితామహాః రుద్రరూపాః మార్జయంతాం ప్రపితామహాః । ఆదిత్యరూపాః । (మార్జయంతాం మాతరః। వసురూపాః । మార్జయంతాం సితామహ్యాః రుద్రరూపాః । మార్జయంతాం ప్రపితామహ్యాః । ఆదిత్యరూపాః) ఇతి తిలోదకం నినీయ ।

**క్రియ :** పరచిన దర్భలమీద మూడుచోట్ల ఉత్తరమునుండి దక్షిణానికి నువ్వులు, నీరు పెడమరలుగా వదలాలి. ఈ క్రింది మంత్రములు చెప్పునప్పుడు వరుసగా ఉత్తరం నించి దక్షిణానికి మూడుచోట్ల ఒక్కొక [illegible] ో ఒ[illegible] మును

పెడమరలుగా చూపి 2) యేచత్వామను । అన్నప్పుడు పిండం ఉంచి గయాయాం దత్తం అస్తు । అన్నప్పుడు పిండముపై చెయ్యి ఆనించాలి.

ఏతత్తే అస్మత్ పితః (మాతః) ... గోత్ర (గోత్రే) ... శర్మన్(దాయీ) వసురూప(రూపే) యేచత్వామను । ప్రథమ పిండం దర్భలమీద ఉంచాలి.

ఏతత్తే అస్మత్ పిత్రే (మాత్రే) ... గోత్రాయ (గోత్రాయై) ... శర్మణే (దాయ్యై) వసురూపాయ (యై) యాశ్చతామనుగచ్ఛంతి తాభ్యశ్చాయంపిండః । తస్మైతే (తస్యైతే) స్వధా నమః । గయాయాం దత్తమస్తు (పిండంపై చెయ్యి ఆనించాలి)

ఏతత్తే అస్మత్ పితామహ (మహి) .. గోత్ర (గోత్రే) ... శర్మన్ (దాయీ) రుద్రరూప (రూపే) యేచత్వామను (రెండో పిండం ఉంచాలి) ఏతత్తే అస్మత్ పితామహాయ (మహ్యై) ...గోత్రాయ (యై) ... శర్మణే (దాయ్యై) రుద్రరూపాయ యాశ్చతామనుగచ్ఛంతి తాభ్యశ్చాయం పిండః తస్మైతే (తస్యైతే) స్వధా నమః । గయాయాం దత్తమస్తు (పిండంపై చెయ్యి ఆనించాలి)

ఏతత్తే ప్రపితామహ (మహీ) ... గోత్ర (గోత్రే) ... శర్మన్ (దాయీ) ఆదిత్యరూప (రూపే) యేచత్వామను (మూడవపిండం ఉంచాలి) ఏతత్తే అస్మత్ ప్రపితామహాయ (మహ్యై) ... గోత్రాయ (గోత్రాయై) ... శర్మణే (దాయ్యై) ఆదిత్యరూపాయ యాశ్చతామను గచ్ఛంతి తాభ్యశ్చాయం పిండః తస్మైతే (తస్యైతే) స్వధా నమః । గయాయాం దత్తమస్తు (పిండంపై చెయ్యి ఆనించాలి)

మం. యన్మే మాతాప్రమమాద్యచ్చ చారానను వ్రతం । తన్మేరేతః పితావృంక్తాం-

మాభురన్యోపపద్యతాం ।

సూ॥ పిండశేషం పిండానాముపరినిధాయ ।

**క్రియ :** కింది మంత్రాలు చదువుతూ పిండాలు చెయ్యగా మిగిలిన శేషాన్ని (తెల్ల మెతుకులు కాకుండా) మూడు పిండాలమీద ఉంచాలి.

**మం.** పితృభ్యః (మాతృభ్యః) స్వధావిభ్యః స్వధా నమః ।

పితామహేభ్యః (పితామహీభ్యః) స్వధావిభ్యః స్వధా నమః ।

ప్రపితామహే (హీ) భ్యః స్వధావిభ్యః స్వధా నమః ।

సూ॥ తిలోదకం నినీయ

**క్రియ :** పిండములమీద కాకుండా ప్రక్కగా తిలోదకం విడివిడిగా పెడమరలుగా వదలాలి.

**మం.** అత్ర పితరోయథా భాగం మందధ్వం ।

**క్రియ :** పిండములమీద చేతులు ఆనించాలి.

**మం.** అక్షన్పితరోమీమదంతపితరో తీతృపంతపితరోమీ మృజంత పితరః ।

పరేత పితరస్సోమ్యాః । యేసమానాస్సమనసః పితరోయమరాజ్యే । తేషాం లోకస్స్వధానమో యజ్ఞోదేవేషు కల్పతామ్ । యేసజాతాస్సమనసో జీవాజీవేషు మామకాః । తేషాగ్‌శ్రీర్మయికల్పతామస్మిన్ లోకేశతగ్ం సమాః । వీరంధత్తపితరః ।

**సూ॥** ఆఘ్రాయ (సవ్యం) పూర్వపవిత్రం సృజ్య పునః పవిత్రంధృత్వా ఆచమ్య ।

**క్రియ :** పిండములు కలిపిన విస్తరిలోని తెల్ల మెతుకును తీసుకొని వాసనచూచి కింద పడవేసి, సవ్యం చేసుకొని పవిత్రం వదలి కొత్త పవిత్రం ధరించి ఉత్తర దిక్కుకి తిరిగి ఆచమనము చేయవలె.

**మం.** ఓం కేశవాయ స్వాహా .... హరే శ్రీకృష్ణాయ నమః

**క్రియ :** మళ్లీ దక్షిణంవైపునకు తిరగాలి.

మం. ఉత్తిష్ఠ పితరః ప్రేతశూరా యమస్య పంథా మనవేతాపురాణం ।

దత్తాదస్మాసు ద్రవిణం యచ్చభద్రం ప్రణోబ్రూతాద్భా

గధాం దేవతాసు । ప్రవాహణీయ మృక్ ।

పరేత పితర స్సోమ్యా గంభీరైః పథిభిః పూర్వ్యైః ।

అథాపిత్రూన్త్సువిదత్రాగ్ం అపీత యమేన యే సధమా దంమదంతి

మనోన్వాహువా మహే నారాశగ్ం సేన స్తోమేన పిత్రూణాంచ మన్మభిః । ఆన ఏతు

మనః పునః క్రత్వే దక్షాయ జీవసే । జ్యోక్చ సూర్యంద్రుశే ।

**క్రియ :** ఉత్తిష్ఠ అనగాను ఆకును తీసి తూర్పువైపున ఉంచాలి మంత్రం చివర సవ్యం చేసుకుని సూర్యునికి నమస్కరించాలి.

సూ॥ కులాభివృద్ధ్యర్థం సవ్యేన పిండ పార్వణపూజాం కరిష్యే ।

**క్రియ :** పళ్లెములో నీళ్లు వదలాలి.

సూ॥ పిండపిత్ర (మాతృ) దేవతాభ్యో నమః । కుశ, పత్ర, తిల, యవ, అక్షతాన్ సమర్పయామి ।

**క్రియ :** పిండములపై బోర్లించిన ఆకును తీసి మూడు పిండములకు దర్భలు, తులసీ దళములు, తిలలు, యవలు మరియు అక్షతలతో పూజ చేయాలి. మాతృ శ్రాద్ధంలో మూడుస్థానాలలో ఎవరైనా పునిస్త్రీగా చనిపోతే వారినుద్దేశించిన పిండాలకు పసుపు, కుంకుమ, పూలతో కూడా పూజ చేయాలి.

సూ॥ ధూపమాఘ్రాపయామి, దీపం దర్శయామి, ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి నైవేద్యం.

**క్రియ :** ధూపదీపములుమానసికముగా సమర్పించి అప్పం లేదా అరిసె నైవేద్యం పెట్టాలి. గారెలు పనికిరావు. తల్లిదండ్రులు, మాతామహీమాతామహుల ఆబ్దికంలో ఈ నైవేద్యపు ప్రసాదాలన్ని కర్త తప్పక తినాలి (స్త్రీ అయినా) అసలు కర్త వేరేచోట

ఉండి మరొకరు పెడుతుంటే నైవేద్యం సమర్పయామి అని నీళ్లచుక్క వదలాలి. నైవేద్యం పెట్టి ఆ పదార్థాన్ని నీళ్లలో కలపాలి (లక్ష్మీపతి సోమయాజీయం)

మం. ఓం భూర్భువస్సువః । ఓం తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి । ధియో- యోనః ప్రచోదయాత్ ॥ సత్యంత్వర్తేన పరిషించామి । పిండపితృదేవతాభ్యో నమః అపూపం నివేదయామి.

**క్రియ :** పదార్థముల మీద నీరు చల్లి చుట్టూ ప్రదక్షిణముగా తిప్పాలి.

మం. అమృతమస్తు అమృతోపస్తరణమసి

**క్రియ :** అని నీళ్ళు వదలాలి.

మం. ఓం ప్రాణాయ స్వాహా । ఓం అపానాయ స్వాహా । ఓం వ్యానాయ స్వాహా । ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా । మధ్యే మధ్యే పానీయం సమర్పయామి.

**క్రియ :** ఐదుసార్లు నైవేద్యం ఇవ్వాలి.

సూ॥ అమృతాపిధానమసి। ఉత్తరాపోశనం సమర్పయామి. హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి. శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

**క్రియ :** పళ్లెములో నీళ్ళు వదలవలె.

సూ॥ తాంబూలం సమర్పయామి ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి సువర్ణమంత్రపుష్పం సమర్పయామి

(ఇంట్లో సంబంధికులంతా పిండాలకు నమస్కరించాలి)

సూ॥ ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ (ప్రాచీనావీతీ) యజమానస్య (అస్మత్) పితృ పితామహ ప్రపితామహాన్ గోత్రాన్ ... శర్మణః .... వసురుద్రాదిత్య రూపాన్ (మాతృ పితా మహీ ప్రపితామహీః గోత్రాః

.... దాయిః ... వసురుద్రాదిత్య రూపాః) ఉద్దిశ్య, పితృ (మాతృ) ఏతేషాం (ఏతాసాం) (కర్త) మయాదత్తాః పిండాః గయాపిండసదృశ మస్త్వితి భవన్తో బృవన్తు (భోక్తలు) గయాపిండ సదృశాభవన్తు ।

**క్రియ :** మధ్య పిండము వద్ద (పడమటివైపు) పెడమరలుగా తిలలు, నీరు వదలాలి (సవ్యం) పిండములకు నమస్కరించాలి.

సూ॥ అపః పిండానుద్వాసయిష్యే (భోక్తలు) ఉద్వాసయ ।

**క్రియ :** మధ్యపిండం పైకెత్తి తిరిగి అదే స్థానంలో ఉంచాలి.

శ్లో॥ (సవ్యం) అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా ।
పురీ ద్వారావతీచైవ సప్తైతే మోక్షదాయకాః ।

**క్రియ :** దర్భలు, తిలలు, ఆకుతో సహా పిండములను తీసి పిండములచుట్టూ ఉంచిన వస్త్రములో మూటకట్టాలి. తరువాత ఈ పిండాలు (1) గోవుకు పెట్టుట (2) అగ్నిలో హుతం చేయుట లేదా (3) బ్రాహ్మలు తినుట (4) నదిలో గాని, కాలువ, చెరువులలో గాని కలుపుట చేయాలి. 1), 3), 4) సందర్భాలలో దర్భలు వేరే పారెయ్యాలి. (తరువాత అంటే ఆబ్దిక కార్యక్రమం పూర్తి అయిన తరువాత, కర్త భోజనానికిముందు)

శ్లో॥ అహం కాశీంగమిష్యామితత్రై వనివసామ్యహం ।
ఇతి బ్రువాణ సతతం కాశీవాస ఫలం లభేత్ ।

శ్లో॥ శమీపత్ర ప్రమాణేన పిండ దద్యాద్గయాశిరే ।
ఉద్ధరేత్సప్త గోత్రాణీ కులమేకోత్తరంశతమ్ ।

సూ॥ పిండస్థానే శాంతి రస్తు । పుష్టిరస్తు । తుష్టిరస్తు । వృద్ధిరస్తు । అవిఘ్నమస్తు। ఆయుష్యమస్తు । ఆరోగ్యమస్తు । స్వస్తిశోభనగ్ంహవిః ఇతిజలం ప్రోక్ష్య ।

**క్రియ :** పిండములు తీసిన చోట తెల్ల అక్షతలు నీరు చల్లవలె. ఆచమనం చేసి పవిత్రం విడిచి నూతన పవిత్రం ధరించాలి.

**గమనిక :** పిండప్రదాన సమయంలోగాని, తరువాతగానిపిండం చితికినా, పిల్లివంటి జంతువులు తాకినా ప్రాజాపత్యకృచ్ఛ్రంచేసి తిరిగి పిండప్రదానం చెయ్యాలి (వేరే అన్నంలో అగ్నిచుట్టూ కింద పడిన మెతుకులు కలిపి పార్వణం చెయ్యాలి)

## ఆసీమాంతము

నువ్వులు, బియ్యం, దర్భలు. నీళ్లచెంబు మొదలైన సామగ్రితో కర్త, భోక్తలు కాళ్లు కడిగిన చోటికి వెళ్లాలి. భోక్తలను వారి మండలాలవద్ద తూర్పు ముఖంగా కూర్చోబెట్టి వారికి అభిముఖంగా ఉండాలి.

సూ॥ దేవాః పితరః పితరో దేవాః ।

విశ్వదేవస్థానే హస్తోదకం దత్వా ।

**క్రియ :** కర్త తాను హస్తోదకము తీసుకొని విశ్వదేవస్థాన భోక్తకివ్వాలి.

సూ॥ కుశ పుష్పాక్షతాం దద్యాత్ ।

**క్రియ :** అక్షతలు శిరస్సున చల్లి దర్భలు భోక్తకు ఇవ్వవలె.

సూ॥ (ప్రాచీనావీతీ) పితృ (మాతృ) స్థానే హస్తోదకం దత్వా ।

**క్రియ :** కర్త తాను హస్తోదకం తీసుకొని పితృ (మాతృ) స్థానములోని భోక్తకు ఇవ్వాలి.

సూ॥ కుశతిల పుష్పాణి దద్యాత్ ।

**క్రియ :** నువ్వులు శిరస్సున చల్లి దర్భలు భోక్తకు ఇవ్వవలె.

**క్రియ :** అక్షతలు మొదట విశ్వదేవస్థానభోక్తకు తరువాత పితృస్థాన భోక్తకు, మరల పితృస్థానభోక్తకు తరువాత విశ్వదేవ స్థాన భోక్తకుపాదముల మీద చల్లవలె. దేవతాపితృ (మాతృ) ప్రసాదేన (కర్త) అస్మద్గోత్రం వర్ధతాం। (భోక్తలు) స్వస్తి వర్ధతాం.

**క్రియ :** విశ్వదేవ ప్రసాదో అస్తు అని విశ్వేదేవస్థానభోక్త, పితృ పితామహ ప్రపితామహ (మాతృపితామహీ ప్రపితామహీ) ప్రసాదోఅస్తు అని పితృ (మాతృ) స్థానభోక్త, చెప్పి కర్త దోసిలిలో అక్షతలు ఉంచాలి. అక్షతలు కర్త శిరస్సున వేసుకొని, మిగిలినవి పైకి చల్లాలి. (స్వగృహం అయితే ఇంటిమీదకి)

సూ॥ (కర్త) దేవాశ్చపితరః ఉత్తానంపాత్రం స్వస్తీతిబ్రూత (భోక్తలు) బ్రూహి స్వస్తి

**క్రియ :** అక్షతలు నీళ్లు చల్లి అర్చన సమయంలో బోర్లించిన ఆకును తిరగతియ్యాలి.

సూ॥ (కర్త) భోజనపాత్రాణ్యుచ్చాలయిష్యే । (భోక్తలు) ఉచ్చాలయ

**క్రియ :** అక్షతలు నీరు తీసుకొని భోక్తలు భుజించిన విస్తళ్లమీద చల్లవలె. ఇప్పుడు భోక్తల విస్తళ్లు మడిగా ఎత్తాలి. ఎత్తే వాళ్లు సువాసినులైతే బొట్టు పెట్టుకుని విస్తళ్లు ఎత్తాలి. ఈ విస్తళ్లు ఆడవాళ్లు, ఉపనయనం కాని వారు, కర్తలు కాని జ్ఞాతులు ఎత్తకూడదని ధర్మసింధులో ఉన్నది. లోకాచారం ప్రకారం సువాసినులే బొట్టు ధరించి ఎత్తుతున్నారు. ఈ విస్తళ్లు, వికిరపిండం, కొత్తగా తవ్విన గోతిలో వేసి పూడ్చాలి. కాని వికిరపిండాన్ని ఒక ఆకులో ఉంచి ఎత్తైనచోట కాకుల కోసం పెడుతున్నారు. కాకులు వికిరపిండాన్ని తినకపోతే పితృదేవతలు అసంతృప్తులైనట్లు భావిస్తున్నారు. దీనికే ఆధారమూ కనపడలేదు.

సూ॥ పురూరవార్ద్రవసంజ్ఞక విశ్వేదేవావఃమయాదత్తం శ్రాద్ధమన్న (కర్త) మక్షయ్యోదర్కమస్త్వితి బ్రూత ॥ (భోక్త) అస్త్వక్షయ్యోదర్కమ్ ॥ (ప్రాచీనావీతి)

సూ॥ పితృ పితామహ ప్రపితా మహాః ।

(మాతృ పితామహీ ప్రపితా మహ్యాః ॥)

మయాదత్తం శ్రాద్ధమన్న (కర్త) మక్షయ్యోదర్కమస్త్వితి బ్రూత (భోక్త) అస్త్వక్షయోదర్కమ్ ॥ (కర్త) స్వాహాంవాచయిష్యే ॥ స్వధాంచ వాచయిష్యే । వాచ్యతామ్॥ (సవ్యం)

మం. ఋచేత్వా రుచేత్వా సమిత్స్రవంతి సరితోనధేనాః । అంతర్హృదా మనసా-
పూయమానాః । ఘృతస్యధారా అభిచాకశీమి । హిరణ్యయో వేతసోమధ్య
ఆసామ్ । తస్మిన్ థ్సుపర్ణో మధుకృత్కులాయీ భజన్నాస్తే మధుదేవతాభ్యః ।
తస్యాసతే హరయ స్సప్తతీరే స్వధాందుహానా అమృతస్యధారామ్ ॥ ఇతి
కూర్చగ్రంథింవిస్రస్య ॥ (ప్రాచీనావీతి)

**క్రియ :** కూర్చముడి విప్పాలి.

(కర్త) పితృభ్యః స్వధోచ్యతాం। పితామహేభ్యః స్వధోచ్యతాం। ప్రపితామహేభ్య స్స్వధోచ్యతామ్।

((కర్త) మాతృభ్యః స్వధోచ్యతాం। పితామహీభ్యః స్వధోచ్యతాం। ప్రపితామహీభ్యః స్వధోచ్యతామ్॥)

(పితృస్థాన భోక్త) అస్తుస్వధా॥ (భూమౌ జలంసించేత్)

**క్రియ :** కూర్చ కొసలు కిందకుండేటట్లు కుడిచేత్తో పెడమరలుగా పట్టుకొని ఎడమచేతితో కొసలమీదుగా నీళ్లు పొయ్యాలి.

సూ॥ అస్తు సంపద్యంతామ్ (భోక్తలు) సంపద్యంతామ్ సవ్యేన విశ్వేదేవౌ॥

**క్రియ :** సవ్యం చేసుకొని కూర్చ మొదళ్లు కిందకుండేటట్లు గుప్పెట్లో పట్టుకుని నీళ్లు వదుల్తూ కూర్చను కూడా వదలాలి.

సూ॥ భుంక్తేభ్యో బ్రాహ్మణేభ్యో దక్షిణాః పాన్తు (భోక్తలు) పాన్తు దక్షిణాః।

**క్రియ :** భోక్తల దక్షిణలు, దర్భలు ఎడమచేతితో ఉంచుకొని కుడిచేతితో కప్పాలి. తరువాత విశ్వేదేవ స్థానంలో బ్రాహ్మణునికి సవ్యంగాను, పితృస్థానంలోని బ్రాహ్మణునికి ప్రాచీనావీతిగాను దర్భలు, దక్షిణ ఇవ్వాలి. పితృస్థానభోక్తకు ఎక్కువ దక్షిణ ఇవ్వాలి. రెట్టింపు ఇవ్వాలని ధర్మప్రవృత్తిలో ఉన్నది. ఈ దక్షిణ చాలామంది తాంబూలంలో పెట్టి భోక్తలు వెళ్లి పోయేటప్పుడిస్తున్నారు.

మం. వాజేవాజే వత వాజినో నోధనేషు విప్రా అమృతా ఋతజ్ఞాః। అస్యమధ్వః పిబత మాదయధ్వం తృప్తాయాతపథిభి ర్దేవయానైః॥

సూ॥ (ప్రాచీనావీతీ) ఉత్తిష్ఠతపితరః

**క్రియ :** కర్త దర్భను పట్టుకొని కూర్చుని ఉన్న పితృస్థాన భోక్తకు ఇవ్వాలి.

**మూడవ ప్రకరణము**

సూ॥ అనూత్తిష్ఠంతుసవ్యేనవిశ్వేదేవా విష్ణునాసహ ।

**క్రియ :** సవ్యం చేసుకుని తరువాత విశ్వేదేవస్థాన భోక్త దర్భ ఇవ్వాలి. తరువాత భోక్తలు నిలబడాలి. కర్త పవిత్రం తీసి నూతన పవిత్రం ధరించి భోక్తలకు ప్రదక్షిణం చేసి విడచిన పవిత్రం ముడి విప్పాలి. ఈ సమయంలో భోక్తలు తూర్పు ముఖంగా నిలుచుంటారు.

మం. ఓం ఆమావాజస్య ప్రసవో జగమ్యా దాద్యావా పృథివీ విశ్వశంభూ ।

ఆమాగంతాం పిత రామాతరా చామాసోమో అమృతత్వాయగమ్యాత్ ।

**క్రియ :** పై మంత్రం పూర్తి అయ్యేసరికి భోక్తలు పశ్చిమముఖంగా తిరగాలి. కర్త వారికెదురుగా నిలబడి ఈ క్రింద వ్రాసిన ఎడమవైపున ఉన్న ఒక్కొక్క శ్లోక పాదం చదువుతుండగా వెంటనే భోక్తలు దానికెదురుగా కుడివైపున ఉన్న ప్రతివచనం చెప్పాలి.

| కర్త | భోక్తలు |
|---|---|
| దాతారోనోఽభివర్ధంతాం | దాతారోవోఽభివర్ధంతాం |
| వేదాస్సంతతి రేవనః । | వేదాస్సంతతిరేవవః |
| శ్రద్ధాచనోమావ్యగమత్ | శ్రద్ధాచవోమావ్యగమద్ |
| బహుధేయంచనోఽస్తు ॥ | బహుధేయంచవోఽస్తు ॥ |
| అన్నంచనోబహుభవే | అన్నంచవోబహుభవే |
| దతిథీగ్‌శ్చలభేమహి ॥ | దతిథీగ్‌శ్చలభధ్వమ్ ॥ |
| యాచితారశ్చనస్సంతు | యాచితారశ్చవస్సంతు |
| మాచయాచిష్మకంచన । | మాచయాచిధ్వంకంచన ॥ |

(కర్త) సత్యాఏతాఆశిషస్సంతు ॥ పవిత్రం విసృజ్య ॥ పవిత్రం విసర్జించి ఉంగరపువేలికి దర్భను కొసలుపైకుండేట్లు ధరించాలి.

**క్రియ :** అన్న శేషః కిం క్రియతాం । (భోక్తలు) ఇష్టైస్సహభుజ్యతామ్ ॥

**క్రియ :** ఇక్కడ నుంచి భోక్తలు కర్తను ఆశీర్వదించే మంత్రం. భోక్తలవిస్తళ్లు ఎత్తడం పూర్తి కాకుండా ఈ ఆశీర్వచనం మొదలుపెట్టకూడదు.

మం. స్వాదుషగ్ంసదః పితరోవయోధాః కృచ్ఛ్రేశ్రితశ్శక్తీవంతోగభీరాః । చిత్రసేనా-

ఇషుబలా అమృధ్రా స్సతోవీరా ఉరవో వ్రాతసాహాః । బ్రాహ్మణాసః పితర

స్సోమ్యాసశ్శివేనో ద్యావాపృథివీఅనేహసా । పూషానః పాతు దురితా దృతావృధోర

క్షామాకిర్నో అఘశగ్ంసఈశత

(ఆశీర్వాదః) ఇహైవ స్తంమావియౌష్టం విశ్వమాయుర్వ్యశ్నుతమ్ ॥ క్రీడంతు-

పుత్రైర్న ప్తృభిర్మోదమానాస్వేగృహే । సర్వస్యాప్త్యై సర్వస్యజిత్యైసర్వమేవతేనాప్నోతి

సర్వంజయతి । శతమానంభవతి శతాయుః పురుషశ్శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే

ప్రతితిష్ఠతి ।

**క్రియ :** కర్త ఉత్తరీయాన్ని రెండు చేతులతో జోలెలాగ పట్టుకోగా భోక్తలు కొన్ని అక్షతలు అందులో వెయ్యాలి. మరికొన్ని కర్త శిరస్సుపైన మరికొన్ని మిగతా కుటుంబ సభ్యులు శిరస్సుపైన (మృతునికంటె చిన్నవారు) వెయ్యాలి.

శ్లో॥ ఆయుః ప్రజాంధనం విద్యాం స్వర్గంమోక్షంసుఖానిచ ।
ప్రయచ్ఛంతు తథారాజ్యంప్రీత్యాన్నృణాంపితామహాః ॥

శ్లో॥ అద్యమేసఫలం జన్మభవత్పా దాభివందనాత్ ।
అద్యమేవంశజాస్సర్వేయాతావోఽ నుగ్రహోద్దివమ్ ॥

శ్లో॥ పత్రశాకాదిదానేనక్లేశితాయూయమీదృశాః ।
తత్క్లేశజాతంచిత్తేషు విస్మృత్యక్షంతుమర్హథ । సర్వం సంపూర్ణం

ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ (ప్రాచీనావీతి) పితుః (మాతుః) ప్రాతిసాంవత్సరిక మృతాహోఖ్యాన్నశ్రాద్ధే పితృపితామహ ప్రపితామహాన్ । గోత్రాన్ । వసురుద్రాదిత్యరూపాన్ । (మాతృ పితామహీ ప్రపితామహీః గోత్రాః దాయీః వసురుద్రాదిత్య రూపాః) (కర్త) అగ్నౌకరణ, బ్రాహ్మణ భోజన, పిండప్రదానం కర్మత్రయం మయాచరితం శ్రాద్ధం యథోక్తమస్త్విత్యను గృహ్ణంతు। (భోక్తలు) యథాకాల దత్తమస్తు గయాశ్రాద్ధం ఫలితమస్తు । (కర్త) ఆసీమాంతమను-వ్రజే ॥ (భోక్తలు) అనువ్రజ ॥

---

**మూడవ ప్రకరణము**

మం. కయానశ్చిత్రఆభువ దూతీసదా వృధస్సఖా । కయాశచిష్ఠయావృతా । వామ-

దేవాయనమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయనమోరుద్రాయ నమః కాలాయ నమః

కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ నమో బలప్రమధనాయ

సమస్సర్వభూతదమనాయనమో మనోన్మనాయ నమః 'అష్టావష్టావన్యేషు ధిష్ణి-

యేషూపదధాత్యష్టాశఫాః పశవః పశూనేవావరుంధేషణ్మార్జాలీయేషడ్వాఋతవ

ఋతవః ఖలువైదేవాః పితరఋతూ నేవదేవాన్ పితౄాన్ ప్రీణాతి ॥ వంశాభి-

వృద్ధిరస్తు । గోత్రాభివృద్ధిరస్తు ॥ అస్యగృహే శ్రీమహాలక్ష్మ్యాః స్థిరనివాస సిద్ధిరస్తు॥

పితరః స్వదేశం గచ్ఛన్తు । ఆగంత పితరః పిత్రుమానహంయుష్మాభిర్

భూయాసగ్ం సుప్రజసోమయా యూయం భూయాస్త । ఇత్యుపతిష్ఠతే ।

## శ్రాద్ధాంగతర్పణము

తండ్రి బతికి ఉండగా తల్లి చనిపోతే, శ్రాద్ధాంగతిల తర్పణం కర్త చేయకూడదు అని పైతృక సంగ్రహంలోను ధర్మప్రవృత్తిలోను ఉన్నది. ఈతర్పణం కేవలం నీటితోగాని, తెల్లనువ్వులతోగాని చెయ్యాలని శ్రాద్ధమంజరిలో ఉన్నది. ఈ తర్పణం కర్త తండ్రి చెయ్యాలని కొందరంటున్నారు (వెంకట సోమయాజీయం శ్లో.301)

**ఆచమ్య :** ఓం కేశవాయ స్వాహా .... ఓం శ్రీకృష్ణాయ నమః ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ । (ప్రాచీనావీతి) పితః (మాతుః) ప్రాతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధాంగ దేశకాల వైపరీత్య శంకయా పరేహని కర్తవ్య సద్య స్తిలతర్పణం (సవ్యం) కరిష్యే ॥ నీళ్లు వదలాలి. (ప్రాచీనావీతి)

**గమనిక :** ఈ తర్పణం మరుసటిరోజు ఉదయం నిత్యానుష్ఠానానికి (సంధ్యా వందనం) ముందు చెయ్యాలి. ఆటంకం వస్తుందనేభయంతో ఆబ్దికం అయిన వెంటనే చేస్తున్నారు. సపిండీకరణం, మాసికాదులు, సంవత్సరీకం మరునాడు పెట్టే మొదటి ఆబ్దికం వీటిలో 'పరేహనికర్తవ్య' అని చెప్పనక్కరలేదు.

సూ॥ అస్మత్పితరం ... గోత్రం ... శర్మాణం వసురూపం స్వధానమ స్తర్పయామి॥ తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి । స్వధానమస్తర్పయామి ।

**క్రియ :** పెదమరలుగా తిలలు, నీళ్లు మూడుసార్లు వదలాలి.

సూ॥ అస్మత్పితామహం ... గోత్రం .... శర్మాణం రుద్రరూపంస్వధానమ స్తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి ॥

**క్రియ :** పైవిధంగానే మూడుసార్లు తిలోదకం వదలాలి.

అస్మత్ప్రపితామహం ... గోత్రం ... శర్మాణం ఆదిత్యరూపం స్వధానమ-స్తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి ॥

**క్రియ :** పై విధంగానే మూడుసార్లు తిలోదకం వదలాలి.

(... మాతరం ... గోత్రాం ... దాయీం వసురూపాం స్వధానమస్తర్పయామి స్వధానమస్తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి ॥ ... పితామహీం ... గోత్రాం దాయీంరుద్రరూపాం స్వధానమస్తర్పయామి స్వధానమస్తర్పయామి ॥ స్వధానమ-స్తర్పయామి ॥ ప్రపితామహీం... గోత్రాం ...దాయీం ఆదిత్యరూపాం స్వధానమ-స్తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి ॥ స్వధానమస్తర్పయామి ॥

శ్లో॥ యేకేచాఽ స్మత్కు లేజాతా అపుత్రాగోత్రిణోమృతాః ॥
తేగృహ్ణంతు మయా దత్తం సూత్రనిష్పీడనోదకం । శ్రీరామ రామ రామ

**క్రియ :** యజ్ఞోపవీతం తావళంగా తీసుకొని బ్రహ్మముడిని నీటితో తడిపి పిడిచి కళ్లకద్దుకోవాలి. సవ్యం చేసుకుని కాళ్లు కడుగుకొని ఆచమనం చేసి ఇంట్లోకి వెళ్లాలి. కార్యక్రమంలో భాగంగా భోక్తలకు దక్షిణ ఇచ్చి ఉండకపోతే ఇప్పుడు తాంబూలంలో దక్షిణ ఉంచి భోక్తలకు ఇవ్వాలి. పిండాలని విసర్జించిన తరవాత కర్త కుటుంబ సభ్యులతో కలిసి బొట్టు పెట్టుకుని పితృశేషాన్ని భుజించాలి. పిండనైవేద్యపు ప్రసాదాన్ని కర్త మాత్రమే తినాలి. భోజనానికి ముందు కర్త దీపారాధనని ఆర్పాలని ధర్మసింధులో ఉన్నది. కాని ఇది ఆచారంలో లేదు.

**మూడవ ప్రకరణము**

## నాల్గవ ప్రకరణము

# సందిగ్ధ పరిస్థితులు

**ఉపోద్ఘాతము :** మంత్రము, క్రియల వివరాలు చదివేటప్పుడు పాఠకులకు అనేక సందేహాలు రావచ్చు. వీలైనంతవరకు వాటిని ఆయా సందర్భాలలోనే పరిష్కరించే ప్రయత్నం చేశాము. మరికొన్ని సందేహాల వివరణ ఈ ప్రకరణంలో చూడవచ్చు.

**1. విభక్త అవిభక్త సోదరులు :**

చనిపోయిన వ్యక్తికి పుత్రులందరూ కర్తలే. అందులో పెద్ద కుమారుడు ప్రధానకర్త. అనేక భార్యలున్నప్పుడు కూడా వయసులో పెద్ద అయినవాడే ప్రధానకర్త, భార్యలలో పెద్ద, చిన్న అనే విచక్షణ లేదు. (స్మృతిసారం) కాని చిన్నవాడైనా జ్యేష్ఠ భార్య ప్రథమ పుత్రుడే ప్రధానకర్త అని స్మృత్యంతరంలో ఉన్నది. కవల సోదరులలో తరువాత పుట్టినవాడు పెద్ద, ముందు పుట్టినవాడు చిన్న (వెంకట సోమయాజీయం) సపిండీకరణం వరకు అపరకర్మ కుమారులంతా కలిసే జరపాలి. (వేంకట సోమయాజీయం) సోదరులు అవిభక్తులుగా (ఉమ్మడిగా వండుకుని తింటూ ఒక కుటుంబంలా) ఉన్నంతవరకూ తదుపరి శ్రాద్ధాలన్నీ కలిపే జరపాలి.

విభక్తులైతే (ఆస్తి పంపకం కాకపోయినా విడిగా నివసించేవారైతే) సపిండీకరణం విడివిడిగాగాని, ఖర్చు అందరూ భరిస్తూ కలిసిగాని జరపవచ్చు. (12వ రోజు కార్యక్రమం) విడివిడిగా జరుపితే తదుపరి మాసికాదిశ్రాద్ధాలు, ఆబ్దికాలు అన్నీ విడివిడిగానే పెట్టుకోవాలి. సపిండీకరణం సమిష్టిగా జరుపుతే సాంవత్సర విమోకం వరకు కలిసే పెట్టుకుని ప్రథమాబ్దికం లగాయతు విడివిడిగా పెట్టుకోవాలి (ధర్మప్రవృత్తి, వేంకట సోమయాజీయం, స్మార్తవివేచని)

అవిభక్త సోదరులు ఏ కారణంవల్లనైనా ఒకసారి విడిగా శ్రాద్ధం జరిపితే తదుపరి అన్ని శ్రాద్ధాలు విడిగానే పెట్టుకోవాలని కొందరు పండితుల అభిప్రాయం. ప్రస్తుతం చాలా కుటుంబాలలో సోదరులు (విభక్తులైనా, అవిభక్తులైనా) తల్లిదండ్రుల ఆబ్దికాలను వీలైనప్పుడు సమిష్టిగాను, కానప్పుడు విడివిడిగాను పెట్టుకుంటున్నారు.

సమష్టిగా పెట్టే ఆబ్దికం సమయానికి జ్యేష్ఠుడు అస్వస్థుడైనా, అతనికి మాత్రమే ఆశౌచం వచ్చినా, తక్కినవారు సమిష్టిగా ఆబ్దికం జరిపించాలి. ఈ జ్యేష్ఠుడు స్వస్థత లేదా శుద్ధి అనంతరం మానకుండా పెట్టాలి. (బహుళ అష్టమి, ఏకాదశి, అమావాస్యలలో) చిన్నవారైతే తిరిగి పెట్టక్కరలేదు (స్మృతిసారం). జ్యేష్ఠుడు పొరుగూరు వెళ్ళవలసివస్తే అతని అనుజ్ఞతో తమ్ముళ్లు ఆబ్దికం పెట్టవచ్చు. ఆబ్దికం మధ్యలో అతడు తిరిగి వస్తే అక్కడినుంచి అతడే నిర్వహించాలి.

జ్యేష్ఠుడు ఆబ్దికం పెడుతుండగా తమ్ముళ్లెవరైనా వస్తే అప్పటినుంచి పాల్గొనవచ్చు. పిండప్రదానం అయిపోయి ఉంటే ఆ వచ్చినవారు మాత్రం ఆనాడుగాని మర్నాడుగాని ఆబ్దికం పెట్టాలి (ధర్మప్రవృత్తి)

అయితే మాసికాదుల విషయంలో జ్యేష్ఠుడికి ఆశౌచం వస్తే శుద్ధివరకూ ఆగాలి. తక్కిన సోదరులలో ఎవరికైనా ఆశౌచం సంక్రమించినా ఇవి ఆపక్కరలేదు (కాని షోడశసాపిండ్యాలు సోదరులందరూ శుద్ధిగా ఉన్నప్పుడే చెయ్యాలి) శ్రాద్ధకర్త ఒకడే అయి, శ్రాద్ధ సమయానికి అస్వస్థుడై శ్రాద్ధం పెట్టలేని స్థితిలో ఉంటే తన కుమారునికి గాని, మరొకరికిగాని అనుమతి ఇచ్చి అతనిచే జరిపించవచ్చు. ఆ సమయంలో భస్మస్నానం చెయ్యాలి. స్వస్థుడైనాక తిరిగి పెట్టక్కర్లేదు (వైదికాభరణం)

**2. తల్లిదండ్రులు కాని వారికి తాను కర్త అయితే :** తాత (మాతామహుడు) అమ్మమ్మ, సవతితల్లి, మేనత్త, అత్తమామలు, పినతల్లి పెదతల్లి, భార్య, సోదరీ సోదరులు, వీరిలో ఎవరికైనా తాను కర్త అయితే వారి ఆబ్దికాలు పార్వణ విధానంగానే జరపాలి.

తల్లిదండ్రులు, తాత, అమ్మమ్మలు - వీరి ఆబ్దికంలో పిండ పితృదేవతల ప్రసాదాన్ని కర్త మాత్రమే తప్పకుండా తినాలి. కర్త కాకుండా వేరే ప్రతినిధి ఆబ్దికాన్ని జరుపుతున్నా కర్త మాత్రం తప్పక ప్రసాదం తినాలి. అటువంటి కర్త అక్కడ లేకపోతే నైవేద్యానికి బదులు నీరు వదలాలి. ఎందుకంటే ఆ ప్రసాదాన్ని కర్త కానివారు తినకూడదు కాబట్టి. ఇతరులకు తాను కర్త అయి ఆబ్దికం పెడుతుంటే నైవేద్యం పెట్టి ఆ ప్రసాదాన్ని నీళ్లలో కలపాలి.

భర్తకు స్త్రీ కర్త అయితే ఆమె పిండప్రసాదం తప్పక తినాలి (స్మార్త వివేచానికి)

**3. ఆబ్దికాల కలయిక :**

తల్లిదండ్రుల ఆబ్దికం ఒకేతిథి అయితే ముందుగా తండ్రి ఆబ్దికం ఆచరించి స్నానం చేసి తల్లి ఆబ్దికం పెట్టాలి. ఋగ్వేదులలో మాత్రం మృతిక్రమాన్ని అనుసరించి పెట్టాలి. శక్తిలేనివారు ఒకే వంటతోను, శక్తిగలవారు రెండు వంటలతోను జరిపించాలి. ఆశౌచంలో పడటంవల్ల శుద్ధినాడు తల్లిదండ్రులిద్దరికీ ఆబ్దికం పెట్టవలసి వస్తే ఎవరి తిథి ముందైతే వారికి ముందు పెట్టాలి. తల్లిదండ్రుల తిథులు పక్కపక్కనై ఏ సంవత్సరంలోనైనా తిథిద్వయం వచ్చినా పైవిధంగానే ఈ సందర్భాలలో వంటలు వేరుగా చేయాలి. ఈ అన్ని సందర్భాలలోను తండ్రి పితృశేషాన్నే కర్త భుజించాలి. పిండనైవేద్యం మాత్రం ఇద్దరిదీ తినాలి. తల్లిదండ్రులలో ఒకరి మాసికంనాడు మరొకరి ఆబ్దికం పెట్టవలసి వస్తే ముందుగా తండ్రిది పెట్టాలి. వంటలు వేరుగా చేయాలి. (వేంకట సోమయాజీయం) తల్లిదండ్రులలో ఒకరి ఆబ్దికము, తాను కర్తగా ఉన్న వేరేవాళ్ల ఆబ్దికము ఒకేరోజున పెట్టవలసి వస్తే, ఆ వేరే ఆబ్దికాన్ని ఇతరులచేత పెట్టించాలి. అటువంటివి రెండు పెట్టవలసివస్తే, ఒకే రోజున ఒకే కర్త పేరుమీద మూడు శ్రాద్ధాలు జరుగకూడదు కాబట్టి వాటిలో ఒకటి మర్నాడు పెట్టాలి. తల్లిదండ్రులిద్దరి శ్రాద్ధాలు, మరొకరి శ్రాద్ధం ఒకేరోజు పెట్టవలసి వస్తే మరొకరిది మరునాడే జరిపించాలి. జ్ఞాతుల ఆబ్దికాలు 2గాని, 3గాని ఒకేరోజున ఒకేకర్త పెట్టవలసి వస్తే మరణక్రమాన్ని అనుసరించాలి (మూడవది మర్నాడు పెట్టాలి) ఆక్రమం తెలియకపోతే దగ్గరివారికి ముందు పెట్టాలి.

**4. కర్మ మధ్యలో ఆబ్దికము :**

తల్లి చనిపోయిన 10 రోజులలో తండ్రి ఆబ్దికం వస్తే 11వ రోజున శ్రాద్ధ హోమం చేసి, తండ్రి ఆబ్దికం జరిపి, తరువాత తల్లికి షోడశశ్రాద్ధం జరపాలి.

అయితే తండ్రి చనిపోయిన 10 రోజులలో తల్లి ఆబ్దికం వస్తే 11వ రోజున తండ్రి షోడశ శ్రాద్ధం పూర్తి అయ్యాక తల్లి ఆబ్దికం పెట్టాలి. (వేంకట సోమయాజీయము)

తల్లిదండ్రులు కాక మరొకరికి తాను కర్మ నిర్వహించవలసిన చేస్తుండగా, తాను కర్తగా ఉన్న ఏ ఆబ్దికమైనా ఆశౌచంలో పడితే 12వ రోజున ఆ ఆబ్దికం పెట్టాలి. 13వ రోజున సాపిండ్యం జరపాలి (లక్ష్మీపతి సోమయాజీయం)

తల్లిదండ్రులలో ఎవరికైనా కర్మ చేస్తుండగా, తాను కర్త అయిన మరొకరి ఆబ్దికం (కర్మచేసే 12 రోజులలో) తటస్థ పడితే ఆ ఆబ్దికాన్ని 13 రోజున పెట్టాలి. (వేంకట సోమయాజీయము)

తల్లిదండ్రులు కాక మరొకరికి అసలు కర్త తరఫున తాను కర్మ చేస్తుండగా (ఉదా. పితామహుడు తన పౌత్రుడు చనిపోగా అతని సోదరుల ప్రతినిధిగా గాని, అతని తండ్రికి ప్రతినిధిగా గాని కర్మ చేయవచ్చు) ఆ ఆశౌచంలో తల్లి లేక తండ్రి ఆబ్దికం పడితే శుద్ధినాడు ఆబ్దికం పెట్టాలి. కర్మశేషం మరొకరిచే జరిపించాలి. (దహనం నుంచి)

### 5. ఆబ్దికం మధ్య ఆశౌచవార్త :

వంటలమీద ప్రోక్షణ చేసిన తరువాత కర్త ఆశౌచవార్త వింటే శ్రాద్ధం పూర్తి అయ్యేదాకా ఆశౌచం అంటదు. వడ్డనమాత్రం ఆశౌచంలేని వారిచేత చేయించాలి. అయితే ఆ యింట్లోనే జననంగాని, మరణంగాని సంభవిస్తే ఆబ్దికం ఆపి 1) కర్తకు ఆశౌచం లేకపోతే ఆ రోజు ఉపవసించి మరునాడు వేరేచోట పెట్టాలి. 2) కర్తకు ఆశౌచం ఉంటే శుద్ధి అనంతరం పెట్టాలి. ఆశౌచం సంక్రమించిన ఇంట్లో శ్రాద్ధం పెట్టకూడదు. భోక్తకు తృతీయ నిమంత్రణం తరువాత ఆశౌచవార్త తెలిసినా శ్రాద్ధం పూర్తి అయ్యేవరకు ఆశౌచం అంటదు. స్త్రీ కర్త అయినప్పుడు "శ్రాద్ధార్థం సంపాదితాః ... భవంతు" అన్నాక బహిష్ఠయితే శ్రాద్ధం ఆగదు.

### 6. కర్తృనష్టము :

ఒకడు తల్లిదండ్రులకుగాని, సోదరునికిగాని సవతితల్లికిగాని కర్మచేసి సంవత్సరంలోపుగా చనిపోతే, అతని సోదరులు లేని పక్షంలో అతని కుమారుడు ఈ మాసికాలను, ఊనాలను, సంవత్సర విమోకాన్ని జరిపి ఆపివెయ్యాలి.

తన సోదరునకు కర్తగా ఉన్న వ్యక్తి చనిపోతే తక్కిన సోదరులలో చిన్నవారిలో పెద్దవాడుగాని, చిన్నవారు లేనప్పుడు అన్నగార్లలో చిన్నవాడుగాని ఇతని బదులు పెట్టాలి. (ఇతని కుమారులు ఇతనికి మాత్రమే కర్మ చేస్తారు) వేరే సోదరులు లేకపోతే, ఇతడు ఎవరికి కర్తగా ఉన్నాడో అతని భార్య జీవించినంత కాలం ఆమె కర్త అవుతుంది. సవతితల్లికి కర్తగా ఉన్నవాడు చనిపోతే అతని సోదరులు వరస [illegible]ంలో కర్తలౌ[illegible]

పుత్రులు లేని వ్యక్తియొక్క ఆస్తి దౌహిత్రులకు సమానంగా సంక్రమించినప్పుడు అతనికి, అతని భార్యకు కూడా దౌహిత్రులు వరుస క్రమంలో కర్తలౌతారు (పెద్దవాడి అనంతరం తరవాతివాడు వగైరా) అంతటితో సరి. తాతగారి ఆస్తిలో ఎక్కువ భాగం దౌహిత్రులలో ఒకనికే సంక్రమిస్తే (ధనహారి దౌహిత్రుడు) అతడు మాత్రమే కర్త అవుతాడు. అతని అనంతరం అతని సోదరులు ధర్మబుద్ధితో అమ్మమ్మ తాతల ఆబ్దికాలు పెట్టవచ్చు.

పై సందర్భాలు కాక తండ్రి సోదరులకుగాని తదితరులకుగాని కర్త అయిన వ్యక్తి చనిపోతే ఆ ఆబ్దికాలు మరెవరూ కొనసాగించనక్కరలేదు.

**7. పితామహుడు (మహి) లేదా ప్రపితామహుడు (మహి) జీవించి ఉంటే**

తండ్రి (తల్లి) శ్రాద్ధ సమయానికి పైరెండు తరాల వారిలో ఎవరైనా బతికుంటే వారి స్థానంలోకూడా కిందితరంవారినే పేర్కొనాలి. ఉదాహరణకు తాత బతికుంటే, పితృ, పితృ ప్రప్రపితామహులు వసు, రుద్ర, ఆదిత్యరూపాలుగా చెప్పాలి. తల్లి విషయంలో కూడా ఇదేవిధంగా చెప్పాలి. (స్మృతిసారము) ఈ విధంగా తద్దినాలు పెడుతుండగా, పైతరంవారు చనిపోతే, సక్రమసాపింద్యం అనే ప్రక్రియ జరిపి ఆ తరువాత ఎవరి స్థానంలో వారిని చెప్పాలి.

తండ్రి చనిపోయిన తరువాత పుత్రులు లేని పితామహుడు చనిపోతే వారికి కర్మచేసి ప్రథమాబ్దికం వరకు అన్నీ పెట్టి ఆపెయ్యాలి. పితామహి అయితే తనతల్లి బతికున్నంతకాలం ఆబ్దికాలు పెట్టాలి. (లక్ష్మీపతి సోమయాజీయం)

**8. గ్రహణం రోజు ఆబ్దికము :**

సూర్యగ్రహణంనాడు పెట్టవలసిన ఆబ్దికాదులు గ్రహణం విడుపు పూర్తి అయినాక (శుద్ధ మోక్షకాలము) స్నానంచేసి, వంట ప్రారంభించి రాత్రి అయినా సరే ఆబ్దికం పెట్టాలి. ఈ సందర్భంలో భోక్తలు, కర్త, భార్య మాత్రమే భుజించాలి. కర్త మృతుని భార్య అయితే మాత్రం ఆమె ఆనాడు ఉపవసించి మరునాడు పెట్టించాలి.

చంద్రగ్రహణం సూర్యాస్తమయం తర్వాత 10 గడియల అనంతరం ప్రారంభం (స్పర్శకాలం) అయితే ఆ సమాయినికి 9 గంటల ముందుగా పౌర్ణమి తిథి ఆబ్దికాదులు

పూర్తి చెయ్యాలి. అంతకుముందే స్పర్శకాలం అయితే ఆనాడు ఉపవాసం చేసి మరునాడు పెట్టాలి. శుద్ధ మోక్షకాలం సూర్యోదయం తరువాత అయితే పాడ్యమి తిథి ఆబ్దికాదులు యథాకాలంలో పెట్టుకోవచ్చు (శుద్ధ మోక్షకాలం తరవాత వంటలు ప్రారంభించాలి) గాని కర్త, భార్య, భోక్తలు మాత్రమే భుజించాలి.

పంచాంగాలలో ఆయా గ్రహణాలప్పుడు నిత్యభోజన ప్రత్యాబ్ది కాలవిషయం వివరిస్తారు. సప్రమాణంగా వివరించిన పంచాంగాన్నే అనుసరించాలి.

గ్రహణంనాడు తప్ప మరెప్పుడూ రాత్రి ఆబ్దికం పెట్టకూడదు. కాని ఏకారణం వల్లనైనా ఆలస్యంగా మొదలుపెడితే (సూర్యాస్తమయంలోపు) సూర్యాస్తమయానంతరం గంటన్నరలోపుగా పూర్తి చెయ్యాలి.

**9. భోక్తల భోజనములో అంతరాయములు (ధర్మసింధు) :**

భోక్తలు భోజనం చేస్తుండగా ఒకరినొకరు తాకుతే భోజనం మానక్కరలేదు. తరువాత 108 మార్లు గాయత్రిజపం చెయ్యాలి. ఒకభోక్తకు మరొక భోక్త ఎంగిలి తగిలితే ఆ చోటు కడుగుకొని భోజనంచేసి స్నానంచేసి 300సార్లు గాయత్రి జపం చెయ్యాలి. ఒక భోక్త విస్తరిలో మరొక భోక్త ఎంగిలి పొరపాటున పడితే, ఆ విస్తరి తీసి వేరే విస్తరిలో వడ్డించాలి. భోక్త కదలకుండా ఒక పాత్రలో చెయ్యి కడుగుకుని భుజించాలి. (వైద్యనాథీయము)

భోజన సమయంలో భోక్తకు మూత్రంగాని, విరేచనంగాని అయితే స్నానం చేసి తగిన ప్రాయశ్చిత్త హోమాలు చేసి వేరొక బ్రాహ్మణుని ఆస్థానంలో నియమించి ఆబ్దికం సాగించాలి. దొరకకపోతే ఆ రోజు ఉపవసించి మరునాడు పెట్టాలి. (స్మార్త వివేచనికి)

విశ్వేదేవస్థానంలోని భోక్తకు శ్రాద్ధం జరుగుతుండగా వాంతి అయితే లౌకికాగ్నిలో విశ్వేదేవతలను ఆవాహనం చేసి పూజించి, అన్నత్యాగం చేసి, 'ప్రాణాయస్వాహా' మొదలైన మంత్రాలతో 22సార్లు హోమం చెయ్యాలి.

పితృస్థాన భోక్తకు పిండప్రదానం తరవాత వాంతి అయితే లౌకికాగ్నిలో చరునిర్వాపం, ఆజ్యభాగాంతం చేసి తరువాత గోత్రనామాలతో పితృదేవతలను ఆవాహన చేసి పైవిధంగానే 22సార్లు హోమం చెయ్యాలి. [illegible] ప్రదానానికి [illegible]

వాంతి అయితే ఆరోజు ఉపవసించి మర్నాడు శ్రాద్ధం పెట్టాలి. లేదా వేరే వంట చేయించి ఆనాడే శ్రాద్ధం పెట్టవచ్చు (ధర్మప్రవృత్తి)

భోక్తల భోజన సమయంలో ఏ భోక్తకు వాంతి అయినా కర్త ఆనాడు ఉపవసించి మర్నాడు శ్రాద్ధం పెట్టాలని పైతృక సంగ్రహంలో ఉన్నది. భోక్త విస్తరిలో కూర్చపడిపోతే కర్త ఆనాడు ఉపవాసం ఉండి మర్నాడు ఆబ్దికం పెట్టాలి.

**10. మరపు :**

ఎ) అర్ఘ్యము మరచిపోయి ఆ సీమాంతం ముందు గుర్తు వస్తే ప్రాయశ్చిత్త హోమములు చేసి అర్ఘ్యపాత్రలు భోక్తలవద్ద ఉంచి తిరిగి అర్ఘ్యం ఇచ్చి అనంతరం ఆబ్దిక కార్యక్రమం కొనసాగించాలి. ఆ సీమాంతం అయినాక గుర్తువస్తే ఆ రోజు ఉపవసించి మరునాడు పెట్టాలి (లక్ష్మీపతి సోమయాజీయము)

బి) పార్వణం మరచిపోతే కర్త భోజనం ముందు గుర్తువస్తే వెంటనే పితృశేష పదార్థాలతో పిండములు చేసి పిండప్రదానం చెయ్యవచ్చు. తనభోజనం అయ్యాక గుర్తువస్తే మరునాడు తప్తకృచ్ఛ్రం చేసి యథావిధిగా ఆబ్దికం పెట్టాలి. (వైదికాభరణం)

సి) అగ్నౌకరణ శేషంలో పార్వణంలో కలపవలసిన భాగాన్ని కల పటం మరచిపోయి పిండప్రదానం చేసి, ఆ సీమాంతంలోపున గుర్తువస్తే, ఆ వంటలోని పదార్థాలతోఅగ్నౌకరణ శేషాన్నాన్ని కలిపి పిండప్రదానం మళ్లీ చెయ్యాలి. ఇవి (వికిరంలో కలిసిపోయినా, వేరే కారణంవల్లయినా) లభించకపోతే అగ్నౌకరణ సమయంలో కిందపడ్డ మెతుకులు కలిపి పిండప్రదానం చెయ్యాలి. (వైద్యనాధీయం)

డి) అగ్నౌకరణం మరచిపోతే అన్నపరివేషణం పూర్తికాక ముందు గుర్తువస్తే వేరే అన్నం వండించి ఆ అన్నంతో అగ్నౌకరణం చెయ్యాలి. పరివేషణాలు పూర్తి అయ్యాక గుర్తు వస్తే ఒకరుగాని ఇద్దరుగాని భోక్తలు లభ్యమైతే (మళ్లీ వంట చేయించి) ఆబ్దికం పెట్టాలి. సూర్యాస్తమయం కాకుండా పిండప్రదానం పూర్తికావాలి. భోక్తలుగాని, వస్తువులుగాని దొరకకపోతే ఆనాడు ఉపవసించి మర్నాడు పెట్టాలి.

ఇ) ఆబ్దికమే మరచిపోతే, గుర్తు వచ్చిన తరువాత వచ్చే బహుళ అష్టమి, ఏకాదశి అమావాస్యలలో ఒకనాడు ప్రాయశ్చిత్త పూర్వకంగా (కృచ్ఛ్రత్రయం) జరపాలి. (ధర్మప్రవృత్తి)

**11. పిండనిషేధము :**

కర్త వివాహం జరిపితే (చేసుకున్నా) ఒక ఏడాది, ఉపనయనం జరిపితే 6 నెలలు, చూడాకర్మ జరిపితే 3 నెలలు, పిండప్రదానం, మృత్తికాస్నానం, తిలలతో తర్పణం చెయ్యకూడదు. కాని తల్లిదండ్రుల ఆబ్దికంలోను, గయాశ్రాద్ధ, మహాలయ, షోడశ, సపిండీకరణాలలోను పిండప్రదానం మానకూడదు.

**12. పితృశేషము :**

భోక్తల భోజనానంతరం ఆబ్దికం వంటలో మిగిలిన పదార్థాలను పితృశేషం అంటారు. శ్రాద్ధకర్తలు, వారి భార్యలు ఈ పితృశేషాన్నే భోజనం చెయ్యాలిగాని మరే పదార్థము తినకూడదు. భర్త విస్తరిలో భోజనం చేసే అలవాటున్నప్పటికి కర్తల భార్యలు ఆబ్దికంనాడు వేరే విస్తరిలో తినాలి. పుత్రులు, బంధువులు అతిథులకు పెట్టవచ్చుగాని శూద్రులకు పెట్టకూడదు. ఏకాదశి వంటి ఉపవాస దినాలైనప్పటికీ శ్రాద్ధకర్తలు, వారి భార్యలు భోజనం చెయ్యాలి. జ్ఞాతుల శ్రాద్ధంలోగాని మాతామహ వంశంలోని వారి శ్రాద్ధంలోగాని పితృశేషంతినవచ్చు. ఇతర శ్రాద్ధాలలో పితృశేషం తిన్నవారు ప్రాయశ్చిత్తంగా ప్రాజాపత్య కృఛ్రం చేయాలి. (ధర్మసింధు) మరునాడు యజ్ఞోపవీతం మార్చుకుని 1000సార్లు గాయత్రి జపం చేస్తే చాలని కొందరి అభిప్రాయం.

**13. నిత్యానుష్ఠానాలు :**

అనాహితాగ్నులు తల్లిదండ్రుల ఆబ్దికంనాడు ఆబ్దికంతరువాతనే నిత్య తర్పణ, వైశ్వదేవ, బ్రహ్మయజ్ఞ, దేవతార్చనాదులు చెయ్యాలి. ఆహితాగ్నులు ఇవన్నీ ఆబ్దికానికి ముందే పూర్తి చెయ్యాలి (సంగవ కాలంలో) దేవతా నివేదనకు వేరే వంట చెయ్యాలి.

**14. సన్యాసులు :**

సన్యాసులకు ప్రేతత్వం లేదుకాబట్టి దహనం, ఆశౌచం, నిత్యకర్మలు ఉండవు. 11వ రోజున పూజ అనగా పార్వణశ్రాద్ధం జరపాలి. తరవాత మాసికాలు, ఆబ్దికాలు పెట్టాలి. పూర్వాశ్రమంలోని పేరునే ముందు 'బ్రహ్మీభూత' అని చేర్చి వాడాలి. మహాలయ పక్షంలో ద్వాదశినాడు మహాలయం పెట్టాలి.

## అనుబంధం - 1

# అన్నసూక్తమ్

నమో బ్రహ్మణే నమో అ స్త్వగ్నయే నమః పృథివ్యైనమ ఓషధీభ్యః ।

నమోవాచే నమోవాచస్పతయే నమో విష్ణవే బృహతే కరోమి ।

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

సహవై దే వానాం చాసురాణాంచ యజ్ఞౌ ప్రతతావాస్తాం వయగ్గ్ స్వర్గం లోక మేష్యామో వయ మేష్యామ ఇతి తేఽ సురా స్సన్నహ్యసహ సై వాచరన్ బ్రహ్మచర్యేణ తప సైవ దేవా స్తేఽ సురా అముహ్యగ్గ్ స్తేన ప్రాజానగ్గ్ స్తేపరాభవన్ తేన స్వర్గం లోక మాయ న్ప్రసృతేన వైయజ్ఞేన దేవా స్స్వర్గం లోక మాయన్న ప్రసృతేనాసురా న్పరాభావయ న్ప్ర సృతో హవై యజ్ఞోపవీతినో యజ్ఞో ప్రస్మృతోఽ నుపవీతినో యత్కించ బ్రాహ్మణో యజ్ఞోపవీత్యధీతే యజత ఏవ తత్త స్మాద్యజ్ఞోపవీత్యే వాధీయీత యాజయే ద్యజేత వా యజ్ఞస్య ప్రస్మృత్యాఅజినం వాసోవా దక్షిణత ఉపవీయ దక్షిణం బాహుముద్ధరతేవధత్తే సవ్య మితి యజ్ఞోపవీత మేత దేవ విపరీతం ప్రాచీనావీతగ్ం సంవీతం మానుషమ్ ॥

రక్షాగ్ంసి హవా పురోనువాకే తపోగ్ర మతిష్ఠంత తా న్ప్రజాపతి ర్వరేణోపా-మంత్రయత తాని వర మవృణీతాఽ దిత్యోనో యోద్ధా ఇతి తా న్ప్రజాపతి రబ్రవీ ద్యోధయధ్వ మితి తస్మా దుత్తిష్ఠంతగ్ం హవాతాని రక్షాగ్ స్యాదిత్యం యోధయంతి యావ దస్తమన్వగాత్తాని హవా ఏతాని రక్షాగ్ంసి గాయత్రియాఽ భి మంత్రితే

నాంభసా శామ్యంతి తదుహవా ఏతే బ్రహ్మవాదినః పూర్వాభిముఖా స్సంధ్యాయాం గాయత్రియాఽభిమంత్రితా ఆపఊర్ధ్వంవిక్షిపంతి తా ఏతా ఆపో వజ్రీ భూత్వాతాని రక్షాగ్ంసి మన్దేహారుణే ద్వీపే ప్రక్షిపంతి యత్ప్ర దక్షిణం ప్రక్రమంతి తేన పాప్మానమవధూ న్వంత్యుద్యంత మస్తంయంత మాదిత్యమభిధ్యాయ న్కుర్వన్బ్రాహ్మణో-విద్వాన్ త్సకలం భద్ర మశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతిబ్రహ్మైవస న్బ్రహ్మైతి య ఏవంవేద ॥ (౨) తై.౨.౧

అహ మస్మి ప్రథమజా ఋుతస్య । పూర్వం దేవేభ్యో అమృత స్య నాభిః । యోమా దదాతి సఇ దేవ మావాః । అహ మన్న మన్న మదంత మద్మి । పూర్వ మగ్నేరపి దహత్యన్నం । యత్తౌహాసాతే అహ ముత్తరేషు । వ్యాత్త మస్యపశవస్సుజంభం॥ పశ్యంతి ధీరాః ప్రచరంతి పాకాః । జహామ్యన్య న్న జహామ్యన్యం । అహ మన్నం వశ మిచ్ఛరామి । సమాన మర్థం పర్యేమి భుంజత్ । కోమా మన్నం మనుష్యోదయేత। పరాకే అన్నం నిహితం లోక ఏతత్ । విశ్వైర్దేవైః పితృభిర్గుప్త మన్నం । యదద్యతే లుప్యతే యత్పరోప్యతే । శతతమీ సా తనూర్మే బభూవ । మహాంతౌ చరూ సకృద్దుగ్ధేన పప్రౌ । దివంచ పృశ్ని పృథివీంచ సాకం । తత్సంపిబంతో నమినంతి వేధసః । నైతద్భూయో భవతినోకనీయః ॥ అన్నం ప్రాణ మన్న మపాన మాహుః । అన్నం మృత్యుం తము జీవాతుమాహుః । అన్నంబ్రహ్మణో జరసం వదంతి । అన్నమాహుః ప్రజననం ప్రజానాం । మోఘ మన్నం విన్దతే అప్రచేతాః । సత్యం బ్రవీమి వధ ఇత్సతస్య । నార్యమణం పుష్యతి నోసఖాయం । కేవలాఘో భవతి కేవలాదీ ।

